# అధ్యాయం ౧

నేనొక అభాగ్యురాలను. నా జీవితము చాల అలక్ష్యమైనది. అట్టి అలక్ష్యమైన నా జీవితమును మీ కెందులకు జెప్పుచుంటి ననుకొనెదరో! నావంటి అభాగినులు ఈ మానవ ప్రపంచమం దెందరో యుండెదరు. అట్టివారికి నా జీవిత చరిత్ర ఒక ఆదర్శ కముగ యుండగలదు. నావలెనే వారును కష్టసముద్రమునుండి దరిజేరగలరు.

మాది వంగరాష్ట్రము. కాళీగంజ మా స్వగ్రామము. నా ముందు జీవిత మెట్లు నడచినను, నేనొక శ్రీమంతుని యింట జన్మించితిని. నేను పుట్టిన రోజుననే ఒక పెద్ద తుపాను వచ్చి, మా గ్రామములో చాలనష్టము కలిగించెనని మాఅమ్మ చెప్పుచుండెడిది. ఆ రోజున ఇండ్లు కూలిపోయెను. చెట్లు నేలపై కొరిగెను. పంటలు చాలా నష్టపోయెను. నేను జన్మించు నప్పుడు ప్రకృతి స్వభావ మెట్లుండెనో యట్లే నా జీవిత స్వభావముగూడ నడచెను.

నా తండ్రి రమేశ్చంద్రదత్తు చాలా పేదకుటుంబమున జన్మించెను. పన్నెండు సంవత్సరములు వయస్సు వచ్చునరికి, ఆయన తన తల్లిదండ్రు లిరువురను గోలుపోయెను. అప్పుడా

దిక్కులేని బాలుని, ఒక వర్తకుడు తన వెంట బ్రహ్మ నకు గొనిపోయి యాతని జీవితమునకు చిన్న యాధారము జూపెను. కాల క్రమమున నా తండ్రి తన స్వయంకృషివల నేమి దైవబలము వలననేమి చాలా ప్రయోజకుడై స్వతంత్ర ముగ వ్యాపారము చేయ మొదలు పెట్టెను. తనకు ముప్పది సంవత్సరములు వచ్చునప్పటికి వ్యాపారమును చాలా అభివృద్ధి చేసి మరి పది సంవత్సరములలో కోటీశ్వరుడయ్యెను. ఆ ధన ముతో నాతండ్రి తన స్వగ్రామమగు కాళీగంజికి వచ్చి కొన్ని భవనములు, తోటలు, భూములు, గ్రామములను కొనెను.

కాళీగంజి ఒక జమీందారి గ్రామము. ఆ జమీందారి కుటుంబము ఎన్నియో తరముల నుండి విద్యకు, ఔదార్యము నకు, దాన ధర్మములకు, వంగదేశ మందంతటను గణత కెక్కెను. అందువలన 'రాజా' యను బిరుదును వారు ప్రభు త్వము వారివలన బడసిరి. కాని కాలవశమున ఆ కుటుంబ పరి స్థితులెల్ల తారుమారై క్రమముగ హీనదశకు వచ్చుచుం డెను. దేశమంత సౌఖ్యాభివృద్ధులను గాంచుచున్నప్పటికిని కాళీ గంజి వచ్చిన రెండు సంవత్సరముల వరకు తన భూవ సతులను అభివృద్ధి పరచుకొనుటలో కాలము గడపెను. అం తట నుండి ప్రజలయొక్క సౌఖ్యాభి వృద్ధులకు తన భూవసతు లకు తోడ్పడవలెనని నిశ్చయించుకొనెను. అప్పటికి కాళీగంజి చాలా అనాగరికావస్థలో యుండెను.

ఆ గ్రామవాసులు సఖము రైతాంగమునకు, సఖము కార్మికాంగమునకు జెందియుండిరి. వారు చాలా అమాయ

నిరుపేద లయ్యాను, సంతృప్తి హృదయులగుటచే జీవిత ధుర్యమును వారు గోలుచుండిరి. ఆ నిరాడంబర జీవుల శ్రేయమునకై నాతండ్రి గొప్ప యోచనలను జేసెను. తన ధైర్యసాహాసముల చేతను అర్థబలము చేతను ఆ గ్రామమునకు నూతన జీవితమును కలుగజేసెను. గ్రామపాలకసంఘ మొక దాని నేర్పరచి, గ్రామమునందు చక్కటి బాటలను, నివాస యోగ్యములగు గృహములను కట్టించెను. మంచినీటి వసతులు నేర్పరచెను. చక్కటి యుద్యాన వనములును, రమ్యమగు నాటకశాలలు, విద్యాలయాలు, వైద్యశాలలను నిర్మించెను. ఆ గ్రామమును రైలు బాటకు కలిపించెను. కొన్ని సంవత్సరములలో శాళిగంజీ వంగ దేశమునందలి ఆరోగ్యస్థానము లలో నొకటిగ జేసెను. ఇదంతయు జూచి చాలమంది ధనికులు నా తండ్రితో నేకీభవించి, ఆయన యుద్యమమునకు తగురీతిని తోడ్పడుచుండిరి.

మా నాన్నగారు శాళీగంజికి వచ్చిన తరువాత, అనగా తనకు నలుబై సంవత్సరములు గడచిన పిమ్మట, మా అమ్మను వివాహమాడిరి. మా అమ్మపేరు విద్యాధరి. ఆమె ఒక గౌరవ నీయమైన కుటుంబము నందు జన్మించెను. వారి వివాహమైన మూడు సంవత్సరములకు నేను జన్మించితిని. నేనే పురుషుడనై జన్మించిన, నా జీవితమేగాక మా గృహ పరిస్థితులు గూడ వేరు విధమున పరిణమించెడివి. నేను ఆడుదానినై జన్మించి నందుననే యుదార హృదయుడగు నా తండ్రి నాయందును, నా తల్లియందును అలక్ష్య హృదయుడయ్యెను. తనకు కుమా

తయు జనించిన దాన ధర్మములు, బహుమానములు ధారాళముగ జేయవలెనని తలచెను. కాని నేను పుట్టినంతనే ఆ ప్రయత్నములనుండి విరమించుకొనెను. నేను పుట్టినది మొదలు మా అమ్మ దీర్ఘవ్యాధికిలోనై మంచ మెక్కెను. అప్పుడప్పుడు బండిపై చల్లగాలికి ఊరుబయటకు వెళ్లినప్పుడు తప్ప మరే సమయమందు కూడ మా అమ్మ మేడపైన తనగది వదలి, గృహమం దెచ్చటను మసలినట్లు నాకు జ్ఞాపకము లేదు. చిన్నతనమందు నేను తన మంచము యొద్దనే ఆడుకొనుచున్నప్పుడుగాని, తప్పటడుగులు వేయుచు పడినప్పుడు గాని ఆమె వంగి నన్ను తన గుండెలపై పరుండ బెట్టుకొని లాలించుచుండెడిది. శరీరము చిక్కి యున్నప్పటికి, చంద్రబింబమువంటి ఆమె చక్కని వదనము నా కన్నుల కిప్పటికిని కట్టినట్లే యుండును. ఆమె సన్నని కంఠమునుండి వెలువడిన కోకిలగానము తలంపునకు వచ్చినంతనే నా వీనులకు విందు గావించుచుండును. విషాదపూరితమగు నా హృదయము ఇప్పటికిని ఆనందోల్లాసములతో యుప్పొంగుచుండును. పసితనమున నాకు పరిచర్యలు తన చేతులార చేయలేక పోతిగదాయని పరితపించిన, యా పవిత్ర మాతృహృదయము నన్నిప్పటికిని కలవరపరచుచుండును.

దేశమం దెందరినో జూచియుంటిని. కాని మా అమ్మను మించిన యందగత్తెను నే నెందును జూడలేదు, అయిన నేమి! నా దృష్టిలో నా తండ్రి యామె నెన్నడు జూచినట్లు కానుపించదు. ఆయనకు నాతల్లిపై యిష్టము కలదు. కాని అతని

ప్రేమయందు కొన్ని లోపములు కలవని నేను గ్రహింపగలిగి తిని. ఆయన తన సమీపమునకు వచ్చినంతనే, మా అమ్మ కొకవిధమైన భయము కలుగు చుండెడిది. ఆమె తరుచు మాట లా [illegible] చుండెడిది.

'విద్యా! ఈ దినము నీ శరీరములో నెట్లున్నది? నీ కుమార్తె యెట్లున్నది?" అని నా తండ్రి మా అమ్మ వద్దకు వచ్చి ప్రశ్నించుచుండెను. ఆయన పెద్ద గొంతుక, ఆ భీకరాకారము, దట్టముగా నెదిగిన యా పొడవైన గడ్డము, పెద్దతల జూచిన నాకు చాల భయమగు చుండెడిది. బహుశా నా తల్లి గర్భమందుండగనే, ఆ భయము నన్నావరించి యుండును. సహజముగు ప్రేమతో నా తండ్రి నన్నెప్పుడు చేర బిలువలేదు. నా తండ్రి యందు నాకుగల భయము ఆయన నాపట్ల జూపుచున్న యలక్ష్యతో మా అమ్మ మనస్సును చాల పీడించియుండును. నా తల్లి యొక్క అమాయకపు యోచనలు నా కెంతో మధురముగను, జాలికలిగించునవిగను, యుండును. ఆమె నా నల్లటి కురులను జూచి యెంతయో గర్వించు చుండెడిది, ఆమె ఒక రోజున నాకు మధ్యపాపిటను దీసి, ముంగురులను చక్కగ దిద్ది సమీపముననేయున్న నా తండ్రితో—

"ఏమండీ! మన శశి చాల అందమైనది కాదూ! ఇది ఆ బొమ్మలోని శకుంతలవలె యున్నది కాదా?" అని పలికెను. ఆ పలుకులకు నాతండ్రి ఎగతాళిగా నవ్వి నవ్వుచూ "ఇక నేమి? నీ కుమార్తె శకుంతల వంటి యందకత్తెయా?" యని పలికెను.

నాకు చిన్ననాటనుండియు సంగీతమునిన అభిరుచి మెండు. అందుచే మా అమ్మ తన గదిలోని త్రొక్కుడు హార్మోనియముపై కొన్ని స్వరములను నాకు నేర్పి, మరొక పర్యాయము మా నాన్నగారితో —

"విన్నారా! మన శశి కంఠమందెంత మాధుర్యమున్నదో? అది పాడినప్పుడు కన్నులు మూసుకొని యక్ష కిన్నరలు పాడుతున్నట్లె భావించి తన్మయత్వము నొందుచుండెదను." దానికి గూడ మా నాన్నగారు యథాప్రీతిగా నవ్వుచు "ఏమీ! నీ కుమార్తె కంఠమందంత మాధుర్యమున్నదా? ఇంక నీకు వలయునదేమి? యక్ష కిన్నరలకున్న సంగీత మామెకు గలదు. ఇంకనా యేమి కలవు? అని చలోక్తిగ బలికెను.

నాకు వలయు దుస్తులెల్ల మా అమ్మ స్వయముగ కుట్టి నాకు సరిచేయుచుండెడిది. ఆమె స్వయముగ చేయవలసిన అవసరము లేదు కాని గృహ కృత్యములందు పాల్గొనలేనందున ఇట్టి పనులందామె నిమగ్నయై కాలము గడుపుచుండెడిది. నన్ను చక్కగ ముస్తాబు చేసి ఎంతయో మురియుచుండెడిది. మా అమ్మకు దైవభక్తి మెండు. ఆమె యెట్టి స్థితిలోనున్నను భగవధ్యానము మాత్రము మరచుచుండెడిది కాదు.

* * * * *

మా కుటుంబము చిన్నదైనను, నా తండ్రి నాశ్రయించిన సమూహము చాల కలదు. వారు నన్ను జూచి కంటగించు

కొనుచుండెడివారు. వారందరికిని యజమాని మా పినతల్లి యశోదాదేవి. నా తల్లి వివాహమైన వెనుక యామె నొక సామాన్య గృహస్థునకిచ్చి వివాహము జేసిరి. కాని రెండు సంవత్సరములలో ఆమె కొక కుమార్తె జనించుట, భర్త చని పోవుట జరిగెను. మా అమ్మ దీర్ఘవ్యాధికి లోనై మంచము పట్టినందున, నా నాన్నగారు మా పిన్నిని పిలిపించి మా గృహ యజమానిగ నామె నొసగిరి. ఇంటి పెత్తనము వచ్చినంతనే యామె గర్వమునకు పట్టు పగ్గములు లేకపోయెను. నా పైనను తుదకు మా అమ్మపైనను కూడ అధికారము చెలాయింప జొచ్చెను. ఆమెకు చిత్తము వచ్చినప్పుడు మూర్ఖముగ మా అమ్మతో కొన్ని మాటలను చెప్పుచుండెడిది.

మా పినతల్లి కుమార్తె నా కంటె ఒక సంవత్సరము పెద్దది. ఆమె శరీరము కూడ నావలెనే తెలుపు. కాని ముఖము గుండ్రముగను, కన్నులు, తల వెండ్రుకలు కొంచెము రాగి వర్ణముగను యుండెడివి. ఆమె పేరు గంగ. కాని మా పిన్ని గంగాభవాని యని పొడుగించి పిలుచు చుండెడిది. ఆమె ఎప్పుడూ ముస్తాబై ఏదో యొకటి నములుతూనే యుండెడిది. ఇంట బుట్టిన బాలికకు జరుగవలసిన ముద్దు ముచ్చటలెల్ల ఆమెకే జరుగు చుండెడివి. తరుచు మేమిరువురము దెబ్బలాడు కొనుచుండెడివారము. మాకు తగవు లేని దినము యుండెడిది కాదు. ఈ తగవుల మధ్య మా అమ్మ కృశించి పోవుచుండెడిది. ఎప్పుడును మా పిన్ని తన కుమార్తెనే సమర్థించు కొనుచు “ఓసీ! ముష్పనాతీ. నీవు రాక్షసి పుట్టుక బుట్టితివే!” యని

నన్ను తూలనాడుచుండెడిది. ఇట్లు కొంత కాలము గడచెను.
ఒకనాడు ఈ తగవు సృతిమించెను.

మా అమ్మకు పువ్వులనిన చాలా ప్రీతి. మా తోటమాలి కృష్ణదాసు ప్రతి ఉదయము ఒక పెద్ద పూలగుత్తిని తీసుకొని వచ్చి మా అమ్మ కిచ్చుచుండెడివాడు. ఆ రోజున అతడు రాలేదు. "అమ్మా! కృష్ణదాసు రాలేదు. నేనే నీకు పువ్వులు దీసుకొని వచ్చెదను" అని బలికి క్రిందికి వెళ్ళి మంచి పువ్వులను గోయుచుంటిని. అప్పుడు కిటికీలోనుండి గంగ నన్ను జూచి, "ఒసే! శశీ!! నీ వెంత చుప్పనాతివే! నా మడిలోని పువ్వులు నిన్నెవరు కోయమనిరి?" అని నన్నదలించెను. నేనా మాటలకు లెక్కజేయక మంచిపువ్వు లన్నియు గోసి మా అమ్మ కిచ్చితిని. తరువాత మా అమ్మకును మా పిన్నికీ ఈ విషయమై చాలసేపు వాద ప్రతివాదములు జరిగెను. తుదకు చాలలేక మా అమ్మ తన కంటికి తడిబెట్టుకొని యూరకుండెను. మా పిన్ని క్రిందికి వెళ్ళి మా నాన్నగారికి ఫిర్యాదు చేసెను. అటుపైన నేను మా అమ్మ గదిని విడచి క్రింద వేరొక గదిలో యుండి, మా పిన్ని పెట్టునది తిని, యచ్చటనే పడి యుండునట్లు మా నాన్నగారు నన్ను శాసించారు.

ఈ మార్పులు మా అమ్మకు దుఃఖమును కలుగజేసెను. కాని నాకు మాత్రము ప్రతిఫలము కనుపించెను. నేను తోటలోనికి పరుగెత్తుకొనిపోయి, మా తోటమాలి కృష్ణదాసు కోసి యిచ్చు పండ్లు తినుచు, నవ్వుగొలిపెడి యాతని పలుకులు వినుచుండెడిదానను. కృష్ణదాసు కొంచెము వయస్సు మళ్ళిన

వాడు. ఆతనికి నాపై ప్రీతి మెండు. మా పినతల్లి పేరు వినిన ముఖము చిట్లించు కొనెడివాడు. ఆమె అందరిపై యధికారము చెలాయించు చున్నందున, ఆమెను 'పెద్దమ్మ' యని పిలుచు చుండెడివాడు.

డాక్టరు సునీలచంద్ర ఛటర్జీ మా గృహ వైద్యులు. ఆయన ప్ర[illegible] మా అమ్మను జూచుటకు వచ్చుచుండెడి వారు. నళినరంజనుడు ఆయన కుమారుడు. అతడు తన తండ్రితో తరుచు మా యింటికి వచ్చుచుండెను. రోడ్డుపై వారి బండి చప్పుడు వినిన తోడనే నేను పరుగెత్తుకొని వెళ్లి నళినరంజనుని లోనికి దీసుకొని వచ్చు చుండెడిదానను. డాక్టరుగారు తన పని జూచుకొని వెళ్లువరకు నళినరంజనుడు నాతో ఆడుకొను చుండెడివాడు. వారి యిల్లు మాకు సమీపముననే యున్నందున నేను వారి యింటికి వెళ్ళు చుండెడిదానను. నళినరంజనుని తల్లి వసంతాదేవి నన్ను చాల ఆదరించు చుండెడిది. "మీ అమ్మగారికి మూడు వేళలందు మంచి పాలొసగిన, ఆరోగ్యముగ యుండునని మా తండ్రి చెప్పగా వినియుంటిని." అని ఒకనాడు నళినరంజనుడు నాతో చెప్పెను. ఆ మాటలు నాకు చాలా సంతోషమును కలిగించెను.

మాకు మంచి పాడి యావులు మూడు కలవు. భోజన శాలలో గంగ రోజునకు రెండు మూడు పర్యాయములు వేడి పాలు త్రాగుచుండుట నేను చాలా మారులు జూచి యుంటిని. అందుచే ఒక రోజున గొల్లవాడ మూడు పెద్ద చెంబులలో

పాలు తీసిన వెంటనే ఆవుల శాలకుపోయి, అందు ఒక చెంబు తీసుకొని తిన్నగా మా అమ్మ గదిలోనికి పోవుచుంటిని. అంత బరువయిన చెంబును నే నెట్లు మోయ గలిగితినో నాకే తెలియదు. నేను మెట్లు సగమెక్కుసరికి గంగ నా కెదురై నన్ను తిట్టుచు నా చేతిలోని చెంబు తీసుకొనుటకు ప్రయత్నించెను. కాని నేనా చెంబును వదలలేదు. "ఓసీ! గయ్యాళీ!! నా పాలను నీవు దొంగిలించు చుంటివా? వదలుము లేనిచో మా అమ్మతో చెప్పి నీ పని బట్టించెదను." అని బలిమిని గంగ నా చేతిలో నుండి చెంబును పైకెత్తి గంగ తలపై ఆ పాలన్నియు గుమ్మరించితిని. మెట్లపై పాలు ప్రవహించు చుండెను. ఈ జగడము విని, మా పిన్ని యచ్చటకు వచ్చెను. అంతలో మా అమ్మ "శశీ! శశీ! ఏమిటా యల్లరి" అనుచు తలుపు వద్దకు వచ్చి నిలువబడెను. కాని మా పిన్ని ఏమియు బలుకలేదు. మేడపైకి వచ్చి తన కుమార్తె తల ముఖము తన పవిట చెంగుతో దుడుచుచు "ఓసీ! మూర్ఖురాలా! నీ వా రాక్షసి పిల్లతో తగవు లాడవద్దని చెప్పలేదా? నీవా చుప్పనాతితో చాలగలవా?" అని తన కుమార్తెను మందలించి మా అమ్మపై కయ్యమునకు దిగెను. మా అమ్మను అనరాని మాటలతో నొప్పించెను. అంతలో మా నాన్నగారు యచ్చటకు వచ్చుట తటస్థించెను. ఆయనను జూచి మా పిన్ని లేచి యేడుపు దెచ్చుకొని "ఈ యింటిలో నేను మసలలేను. రేపే నే నెచ్చటికైనను పోయెదను." అని బలికెను. మా నాన్నగారు సంగ

తంతయు గ్రహించి “ యశోదా ! నీ వట్టిపని చేయు నవసరము లేదు. నా గృహ పరిస్థితులు నేను చక్కబెట్టుకోలేనా ? రేపటి నుండి ఈ పిల్లను బడికి బంపించెదను. తప్పక వెళ్ళి తీరవలెను. ” అని నుడివి లోనికి బోయెను.

# అధ్యాయం ౨

మా గృహమునకు సమీపముననే ఒక ప్రాథమిక పాఠశాల కలదు. అది ఒక సంఘము యొక్క అధ్వర్యమున నడుపబడుచుండెను. అందులో బాల బాలికలకు కలిపి చదువు జెప్పుచుండిరి. ఆ బడిలో ఒకే పంతులమ్మ వారందరకును జదువు జెప్పుచుండెను. ఆమె నల్లటి శరీరము, పొడుగైన స్థూల కాయము, కొంత వికృతాకృతిని దాల్చెను. ఆమె వయస్సు సుమారు నలుబది వత్సరము లుండును. తరచు ఆ పంతులమ్మ మా యింటికి వచ్చి, మా పిన్నితో కొంతసేపు ప్రసంగించి, ఏదైన తనకు వలయునది తీసుకొని వెళ్ళుచుండెడిది. మేము బడికి వెళ్ళుచున్నప్పటి నుండియు కనిపెట్టుచునే యుంటిని—గంగ చాలా తెలివి గలదనియు, బుద్ధిమంతురాలనియు, ఆ పంతులమ్మ పొగడుచుండెడిది. నాకు పాఠము ఒక పంక్తి చెప్పెడిదో లేదో కాని, నన్ను గసరి హడలు గొట్టుచుండెడిది. నళినరంజనుడు కూడ మా బడిలోనే చదువు కొనుచుండెను. కాని అతడు మాకంటె రెండు తరగతులు పైన యుండెను. అతడు మాకు కొంచెము దూరములో కూర్చొనుచుండెను.

ఒకనాడు నేను నా పలక ముఖమునకు అడ్డు పెట్టుకొని నా ప్రక్కనే యున్న మరొక బాలికతో నెమ్మదిగా మాట్లాడు

చుంటిని. అది జూచి మాట్లాడవద్దని పంతులమ్మ మమ్ములను శాసించెను. కాని నేను మాట్లాడుట మానలేదు. నాకిరు ప్రక్కలను గూర్చొనియున్న బాలికలు నవ్వదొడగిరి. అదిజూచి [illegible] యొక్క రేఖలను [illegible] హేళనము జేసి యా బాలికలను నేను నవ్వించుచుంటినని తలచెను, అప్పుడామె కండ్లెర్రజేసి “శశిరేఖా! నీవు చెప్పుచున్న సంగతి దయచేసి గట్టిగ జెప్పుము. నేను గూడ వినియెదను.” అని కేక వేసెను. నేను దానికి జవాబేసంగతియు పలకను నా ముఖమునకింకా దగ్గరగ బెట్టుకొని కూర్చొని యుంటిని. “నేను చెప్పునది వినబడుటలే [illegible]? నోరు తెరచుకొని మాట్లాడుము, నీ నోటిలో నాలుక యున్నది కదా?” అనెను. దానికిని నేను సమాధానమొసగ లేదు.

“శశిరేఖా! నీవు లేచి ముందునకు రమ్మా” అని యుదరించెను. నే నప్పుడు లేచి నిలువవలె ననుకొంటిని కాని అంతలో గంగ నా దృష్టిలో పడెను. పంతులమ్మ నన్ను శిక్షించుచునని యామె సంతసించు చున్నట్లు ఆమె ముఖమే చెప్పుచుండెను. అక్కడనుండి ఒక్క యడుగైనను జరుగకూడదని నే నిశ్చయించుకొంటిని. “ముందునకు రమ్మా” నీ యాటలు నా యొద్ద సాగవు. నీ కా పెంకితనము ఇంటివద్ద నాగ్గుపాలతో నేర్పియుండిరి.” అనెను. ఆ విసురు మా అమ్మ పైనని నాకు తెలియును. నాకు కోపము వచ్చెను. ఆ స్థలమునుండి కదలకూడదని నాకు పట్టుదల కలిగెను. అప్పుడు పంతులమ్మ తన కోప

మును బట్టలేక, ముందునకు వచ్చి నన్నని నా చేయి బట్టి లాగుటకు ప్రయత్నించెను. కాని నా రెండవ చేతిని నా ముందుననే యున్న వ్రాతబల్లకు పైన వైచితిని. ఆమె నన్ను విడిపించలేక! పెద్ద బాలికల నొకరిద్దరి సహాయము నామె కోరెను. అప్పుడు వారు బలిమిని నన్ను నిలువబెట్ట గలిగిరి, నాకు గలిగిన అవమానమునకు దుఃఖము పొంగి వచ్చుచుండెను. కాని నేను అదిమి పట్టితిని. కన్నులందు నీరు మాత్రము గిరున తిరుగుచుండెను. అప్పుడు పంతులమ్మ పిల్లల నందరినీ జూచి “ మీ రందరును పలకలను క్రింద బెట్టి నేను చెప్పునది శ్రద్ధగా వినుడు.—ఈ బాలిక చాలా పెంకిది. తల్లి గారాబము వలన చాలవరకు పాడయ్యెను. మహాసాత్వికురాలగు తన పినతల్లిని ఇంటిలో చాల యల్లరి బెట్టుచుండును. ఈ పిల్లను మంచి మార్గములోనికి దెచ్చుటకై నా కప్పగించి యుంచిరి. కనుక ఈమెకు మీ యందరిలో బుద్ధిని కలుగజేసెదను. ” అని బలికి ఒక పొడుగైన పేకబెత్తమును దీసుకొని, నన్ను చేయి జాపమనెను. నాకు చాల యవమానముగ దోచెను. అప్పుడు మా అమ్మ తలంపునకు వచ్చెను. నా స్థితి గాంచిన మా అమ్మ యొక్క హృదయ మెంత నొచ్చుకొనునో కదా! నేను దుఃఖమును బట్టలేక పోతిని. “ క్షమింపుడు నన్ను కొట్టవద్దు ” అని బిగ్గరగ ఏడ్చితిని, అంతలో వేరొక వైపునుండి నళినరంజనుడు తొందర పాటున నా ప్రక్కకు వచ్చి చేతులపై చొక్కాను వెనుకకు దీసుకొని, భీమునివలె పంతులమ్మకు యెదురుగ కోపముతో నిలచెను.

"నళినరంజనీ! నిన్నెవరు యిచ్చటకు రమ్మనిరి? పోమ్మావలకు" అని పంతులమ్మ యరచెను. నళినరంజనుడు ఆమె చేతియందలి బెత్తమును చటాలునలాగి, ఆమెను రెండు మూడు దెబ్బలు దానితో బలముగ గొట్టెను. ఆ దెబ్బలకు తాళలేక, పంతులమ్మ గోడపై కొరిగెను. ఆమె యూపిరి దీసు కొనక పూర్వమే నళినరంజనుడు నా చేయి బట్టుకొని నన్ను బయటకు దీసుకొని పోయెను. తరగతిలోని పిల్లలందరు తెల్ల బోయిరి.

* * * * *

నన్ను తిరిగి బడికి పంపలేదు. నళినరంజనుని సంఘము వారు బడినుండి వెళ్ళగొట్టిరి. మా చదువు పాడయ్యెనని మా అమ్మ, నళినరంజనుని తల్లి చాల విచారించిరి. ఇది జరిగిన తరువాత మా పినతల్లి నా గురించి చేతులు కడుగుకొనెను. డాక్టరుబాబు తన కుమారుని మరొక మార్గమున బెట్టుటకు యోచించుచుండిరి. ఈ లోపున నేను నళినరంజనుడు చాల కలసిమెలసి తిరుగుచుంటిమి నళినరంజనుడు చదువుయందెట్లు వున్నను పరుగెత్తుట, ఈతలాడుట, యేటిలో పడవ నడపుట కొండగుట్టల నెక్కుట మొదలగు సాహస కార్యములందు చిన్ననాటనుండియు మంచి అభిరుచి కలిగియుండెను. పాశ్చాత్యులు మన దేశమునకు వచ్చి, హిమాలయ పర్వతముల నెక్కుటకు చేయు ప్రయత్నములను తన తండ్రి చెప్పగా విని నళిన

రంజనుడు తాను పెద్దవాడైన పిమ్మట హిమాలయ పర్వతా రోహకుడ నగుదునని తరుచు నాతో చెప్పుచుండెడివాడు.

మా యింటికి రెండు మూడు మైళ్ళ దూరములో ఒక కొండ గలదు. దానిపైకి నన్ను దీసుకొని పోయెదనని నళిని రంజనుడు నాకు చాలసార్లు వాగ్దానములు చెప్పియుండెను. తుదకు ఒకనాటి సాయంకాలము నన్నచ్చటికి గొనిపోయెను. నళిన రంజనుడు శ్రమ జెందకయే కొండపైకి పోగలిగెను. కాని నాకు మాత్రము చాల కష్టమయ్యెను. అది తెలిసిన నాకు ధైర్య సాహసములు లేవని నళినరంజనుడు హేళన జేయునని భయ పడితిని, కనుక యెట్లో కొండపైకి యాతనితో వెళ్ళగలిగితిని. నే నంత ఎత్తైన ప్రదేశమునుండి మా గ్రామ దృశ్యమును జూచియుండలేదు. మా గ్రామ సౌందర్యమును జూచి, నే నెంతయో అబ్బురపడితిని. సూర్యాస్తమయమయ్యెను. కాని నళినరంజనుడు యింకనూ కొండ దిగుట కుపక్రమించక, ఇటూ నటు పచారులు జేయుచుండెను. క్రమముగ చీకటి కూడ పడుచుండెను.

'నళిన్ ! చీకటి పడుచున్నది. ఇంటికి పోవుదము రమ్ము" అని నే నంటిని.

"శశీ ! నీకు భయమగుచున్నదా ?"

"లేదు."

"అట్లయిన నీ వెందులకట్లనుచుంటివి ?"

"చీకటి పడుచున్నందున, దారి కనబడ దేమోనని——"

"అట్లయిన దిగిపోవుదమురమ్మా" అని క్రిందికి దారి తీసెను. ఆకొండపై పొదలు దట్టముగ యల్లుకొని యుండెను. అందుచే కొంతదూరమేగిన పిదప మాకు దారి కనపడలేదు. ఇటునటు ఎంతరో దూరము వెళ్ళితిమి. కాని ప్రయోజనము లేకపోయెను. మేము దారి తప్పిపోతిమి. అంతలోనే మబ్బు వైచెను. చినుకులు పడుచుండెను. వళీనరంజనుడు నాకు కొంచెము ముందుగనే నడచుచుండెను. ఒకచోట కాలుజారి వళీనరంజనుడు క్రిందకు దొర్లెను. అదృష్టవశమున, ఒక పెద్ద రాయి అడ్డుగా యున్నందున దాని ఆధారముపై యాతడు లేచి నిలుచుండెను. కాని అతని ఎడమచేతికి పెద్ద గాయము తగిలెను. అందుకు లెక్క-జేయక వళీనరంజనుడు తన జేబు రుమాలును దీసుకొని, గాయమునకు గట్టిగ కట్టుకొని నాకు ధైర్యము జెప్పెను. అంతలో కృష్ణదాసు, మరి యిరువురు సేవకులు దీపములు పట్టుకొని మమ్ములను వెదకుచు యుచ్చుటకు వచ్చిరి. వారు మమ్ముల నెత్తుకొని ఎవరియిండ్లకు వారిని దీసుకొని వెళ్ళిరి. మాయింటిలో నాపై నెట్టిచర్యను దీసుకొనలేదు. మేమింటికి చేరునప్పటికి, మా అమ్మకు జబ్బు చాల హెచ్చయ్యెను. ఇంటియందెల్లరు తత్తర పడుచుండిరి.

మా అమ్మకు జబ్బు హెచ్చుగా నున్న పదిహేను దినములు, నేనామెను విడువకుండా కనిపెట్టుకొని యుంటిని. ఆమె చెప్పినంతనే పరుగునవెళ్ళి ఔషధము, పాలు, మంచు దెచ్చి యిచ్చుచుండెడిదానను. నేను పడుక్రశమకు నేనే తెచ్చుకొను చుండెడిదానను.

"అమ్మా! నీతల్లి లేకపోతే నీకివన్నియు నెవరు తెచ్చి పెట్టెదరే!" అని ఒకనాడామెను యడిగితిని. అప్పుడు మా అమ్మ నన్ను తన ప్రక్కకు చేరదీసుకొని, మృదువుగ నాతల నిమురుచు నన్ను ముద్దిడుకొని "అవునమ్మా! నాతల్లి లేక పోయిన ఒక నిమిషము నాకు గడచుట కష్టము" అని పలికెను. ఆ మాటలు విని నేనెంతయో గర్వించితిని.

* * * *

ఈ మధ్యలో నళినరంజనుని నేను చూడలేదు. డాక్టరు బాబు అతని విషయమై మా అమ్మతో చెప్పగా వినుచుండెడి దానను. నళినరంజనుని చేయి నయమైన వెనుక యాతనిని కలకత్తా బంపి, ఒక కళాశాలలో ప్రవేశపెట్టుటకు నిశ్చయించుకొనిరి. నా సంగతి నేనెప్పుడు మా అమ్మను యడుగలేను. కాని మా అమ్మ నన్ను విడిచియుండలేదుకదా యని సంతృప్తిపడుచుండెడిదానను.

గంగాధరశాస్త్రిజీయను ఒక గొప్ప పండితుడు. తరుచు మాయింటికి వచ్చుచుండెను. సామాన్యులేగాక విద్యాధికులు గూడ ఆయన కవిత్వమును విని ప్రశంసించెడివారు. ఆయన వయస్సు, ఏబదివత్సరములకు పైబడి యుండును. శాస్త్రీజీ పాండిత్య మెట్టిదో, యట్లే స్వభావముకూడ చాల సరళమైనది. మా గ్రామవాసులెల్ల శాస్త్రిజీని మిక్కిలి గౌరవించుచుందురు. సాధారణముగ ఆయన సలహా లేనిది గృహసంబంధ

మైన యేవిషయమునుకూడ మానాన్నగారు చేయదలపెట్టరు. గంగాధరశాస్త్రీజీ వాక్కును మాఅమ్మ దైవవాక్కువలె భావించుచుండెడిది. వ్యాధిగ్రస్థయైన మాఅమ్మకు ఆయన ఎంతయూ స్థైర్యమును కలిగించెను. శాస్త్రీజీయెడల నేను చిన్ననాటనుండియు చాల భక్తిశ్రద్ధలు జూపుచుంటిని.

ఒకనాడు మా అమ్మకు కాళ్ళపై శాలువ గప్పి, యామె కొనుటకై క్రిందకు బోవనుంటిని. అంతలో గంగాధర శాస్త్రీజీ లోనికి వచ్చెను. మా అమ్మ శాస్త్రీజీకి నమస్కరించి కూర్చుండ జేసెను.

“శశీ! నీవు పోవలదు. కొంచెముసేపు ఇచ్చటనే యుండుము. నిన్ను కాశీ తీసుకొనివెళ్ళి అక్కడ హిందూ మహిళా విద్యాలయములో జేర్పించుటకు, తగుయేర్పాటు లన్నియు గావింపబడెను.” అని శాస్త్రీజీ పలికెను. అది విని మా అమ్మ నిర్ఘాంత పోయెను. కొంత తడవామె ఏమియును బలుకలేదు. ఆమె చక్కటి వదనము పాలిపోయెను. ఆమె తన దుఃఖమును దిగమ్రింగుచు “శాస్త్రీజీ! ముక్కుపచ్చలారని ఏడుసంవత్సరముల బాలికను చదువునకై యంతదూరము బంపుట భావ్యమా?”

“విద్యాధరీదేవి! నీవు విచారింప నవసరము లేదు. విద్యాలయము నందలి ప్రధానోపాధ్యాయిని ఈమెను తన కుమార్తెవలె జూచుకొని విద్యాబుద్ధులు గరుపగలదు. ఆమె మహాసాధ్వి దైవభీతిగలది. ఆమె మంచితనమును నాకెందరో చెప్పియుండిరి.”

“ అగుగాక — కాని నాకీ ప్రపంచములో నా శశిదక్క-వేరెవ్వరు కలరు ? ఆమెను దీసుకొని పోయినచో నా హృదయము బ్రద్ధలగును. ”

ఆ మాటలకు శాస్త్రిజీ హృదయము నీరయ్యెను. ఆయన కొంతతడవు నిదానించి, “అమ్మా ! నీమనో కష్టమును నే నెరుంగుదును. కాని బాలికయొక్క విద్యాభివృద్ధికై మనము యత్నింపవలసి యుండెను. దైవకృపచే ఆమె విద్యాబుద్ధులనూ బడసి గొప్ప మేధావిని కాగలదు, మరియొక సంగతిని జ్ఞాపకము బెట్టుకొనుము. ఈయింట ఒకవ్యక్తి స్వార్థపరత్వమై మీబాలిక విషయమై చెడుయోచనలతో నుండెను. ఆ కారణము వలన మనశశి కొంతకాలము అన్యప్రదేశ మందుండుటయే శ్రేయోదాయకము. మరియు సెలవుదినములలో నన్నచ్చుటకు బంపి, ఈమెను గొనివచ్చుటకై నీభర్తయొద్దనుండి నేను వాగ్దానమును దీసుకొని యుంటిని. ”

అప్పుడు మాఅమ్మ కన్నీరును దుడుచుకొని — నావైపునకు తిరిగి, నన్ను తన కౌగిలిలోనికి దీసుకొని, నాతల నిమురుచు, “ అమ్మా శశీ ! నన్ను విడిచి నీవు కాశీకి వెళ్లెదవా ? సెలవు దినములందు నీవు తప్పకవచ్చి నన్ను జూచుచుండవచ్చును. ” అని పలికెను.

అంతలో మాపిన్ని యచ్చటకు వచ్చెను. మా అమ్మ చెప్పుచున్న అఖరు మాటలను వినియుండెను. “ అక్కా ! నీమాటలు వినిన నాకాశ్చర్యము కలుగుచున్నది. శశియొక్క

బాగును నీవు యోచించుచున్నట్లు కానుపించదు. దానికి అల్లరి, పెంకితనము హెచ్చగుచుండెను. నిన్ను విడిచియుండిన గాని దానికి బుద్ధిరాదు. పైగా అది నీయొద్ద నున్నంత కాలము నీకు సౌఖ్యము లేదు, కనుక నామాట విని దానిని కాశీకి వెళ్ళనిమ్ము" అని మాపిన్ని పలికినంతనే మాఅమ్మకు కోపము వచ్చెను.

"యశోధా! నాకుమార్తె క్షేమమున్నకై నీవెంత తాపత్రయము పడుచున్నది నాకు తెలియును. నీవు నాకుమార్తెను నాయొద్దనుండి విడదీయుటకు ప్రయత్నములు జేయుచుంటివి. అది నాకు తెలియును. నీవు నాగృహము ప్రవేశించినప్పుడు నాకుమార్తెను నీదిగా భావించి, ప్రేమాదరములు జూపెదవని నేను తలచితిని. దానికై నీహృదయ ద్వారమును బంధించుకొంటివి. నేను మంచముపట్టి అశక్తురాలనై తినని దలచి, ఎన్నడైన నాబిడ్డకు వలయు సంరక్షణ గావించితివా? నీబిడ్డ యొకటి నీసోదరి బిడ్డ వేరొకటియా? నీబిడ్డతో సహితముగ నాయింట జొచ్చి జీవించుచు, నాబిడ్డను నాయింటనుండి తరిమి వేయ జూచుచుంటివా?" అని మాఅమ్మ అనెను.

ఆ మాటలకు మాపిన్ని తన కండ్లెఱ్ఱ జేసుకొని, "అక్కా! నీవిట్టి కఠినోక్తులాడు చున్నందులకు నేను చాల విచారించు చుంటిని. నీవశక్తురాలవైనందున నీకు మహోపకారము జేయుటకై నీయింట జొచ్చితినిగాని, నాకు నా కుమార్తెకు జీవనోపాది లేక కాదు. సరియైన విద్యాబుద్ధులు లేక పెంకియై

సంచరించుచున్న నీ కుమార్తెకు భయభక్తులు జెప్పుచున్నం దున ..........." అని మాపిన్ని ఇంకనూ నెద్దియో చెప్పుచుండ " యశోధా! నీకుమార్తెకు నీవు భయభక్తులం జెప్పుకొని, నాకుమార్తెను నాకు విడువుము. నా ఒక్కగాని ఒక్క బిడ్డను నేజీవించు కొద్దికాలమైనను స్వాతంత్ర్యము కొననిమ్ము. సంసార సౌఖ్యములను నేననుభవించ లేను. నాభర్తను, నాకు నాబిడ్డకు మారము గావించుము." అని మాఅమ్మ పలికెను. ఆమాటనందుకొని మాపిన్ని, "చాలును. ఇంక నీబాగుడు కట్టిబెట్టుము. ఈస్థితియందు నీమనస్సును కష్టబెట్టదలచుకొనలేదు. కాని నీకుమార్తెను నీయొద్దనేయుంచి నీరోగమును హెచ్చు గావించదలచు కొనలేదు." అనెను.

" యశోదా! ఇటు మాటుము—నీహృదయ మొక పాషాణము, నాకస్వస్థత కలుగ జేయుచున్నది. నాబిడ్డగాను దానిని పలుకష్టములు బెట్టుచున్న నీ వేనాస్థితికి కారకురాలవు ఏను సం వత్సరముల నుండియు దానిని రాచి రంపమున బెట్టుచుంటివి. నీవే నాహృదయ మందలి రక్తమును స్రవింపజేయుచుంటివి. నీవు నాకును నాకుమార్తెకును ఎడబాపు చేయ జూచుచుంటివి. నాకుమార్తెపై నాకధికారము లేదా? కనిపెంచిన నాబిడ్డపై నాకంటె నీకధికారము కలదా? నీకధికారము లేదు. నాబిడ్డను ఎడబాపి నేనుండను. నాకంఠమున ప్రాణమున్నంత కాలము నేను దానిని విడిచియుండజాలను." అని మా అమ్మ నుడువుచుండ అంతలో మానాన్నగారు గదిలోనికి వచ్చిరి.

"దేవుని విడిచి యుండజాలవు ?" అని మాఅమ్మవైపు నకు జూచి ప్రశ్నించిరి. అప్పుడు మాపిన్ని ఏడ్చుచు "మీ యింటబొచ్చి మీబిడ్డను నేను యేడుసంవత్సరముల నుండి పోషించుచుంటినట—ఈ యింటినుండి దానిని బయటకు బంపుటకు నేను ప్రయత్నించుచుంటినట—తనబిడ్డపై తనకేగాని వేరెవ్వరికిని యధికారము లేదట" యని యింకనూ నేదియో బలుకుచుండ, మా నాన్నగారి మోము ఎఱ్ఱబడెను.

"ఏమీ! కుమార్తెపై యధికారము ఈ యింట తండ్రికి నశించి ఎంతకాలమైనది? దాని బాగోగులు యోచించవలసినది తండ్రికాదా? ఇన్నియేండ్లు తండ్రిగారియొక్క విధియైయున్నది. ఇదియే ప్రపంచ ధర్మము—మీలో మీరిట్లు తగవులాడుట మూర్ఖత్వముగాని వేరొండుకాదు" అని నాతండ్రి యనినంతనే మాఅమ్మ కొంచ ముపశమించి,

"నేను చెప్పినది వేరు..."

"నీవు చెప్పునది యనవసరము. నాబిడ్డకు విద్యాబుద్ధులు చెప్పించుకొనుటకై నాయిష్టమువచ్చిన ఏర్పాట్లు జేసెదను." అని బల్లపై తన పిడికిలితో కొట్టి నాతండ్రి పలికెను.

మాఅమ్మ మెత్తబడెను. వేరు మాటాడక "మంచిది—అట్లే చేయుడు. మీ విద్యుక్త ధర్మములు మీకు దెలియును. యశోధా! నీవు—శాస్త్రిజీ! మీరు నాబిడ్డ శ్రేయమును యోచించి మీకిష్టము వచ్చినట్లు చేయుడు" అని మాఅమ్మ

చెప్పినంతనే, మానాన్నగారూ శాస్త్రిజీని తీసుకొని క్రింది కెళ్లెను. వానివెనుక మా పిన్నిగూడ వెళ్ళెను. మాఅమ్మ చాల అలసిపోయెను. ఆమె సొమ్మసిల్లినట్లు చాలసేపు పరుండి యుండెను. ఆమెయొక్క అమాయకత్వము మెత్తని మనస్సు ఆమెనాకై పడిన మనోవ్యధ—నాకుజూపిన మాతృప్రేమ, ఇప్పటికిని నాకన్నులకు గట్టినట్లుండును. అవి యెన్నటికిని నాకు మరపునకురావు. అన్నట్లు చెప్పమరచితిని, నేను తనకుమార్తెనని, నాతండ్రి తన నోటార జెప్పుకొనుట బహుశా ఇదియే మొదటి పర్యాయము.

# అధ్యాయం 3

ఒక దినములో నా ప్రయాణమునకు తగు ఏర్పాట్లెల్ల గావింపబడెను. మాఅమ్మ ఒకదర్జీని బిలపించి నాకువలయు దుస్తులెల్ల కుట్టించెను. అవన్నియు ఒక దాసిచే రెండుపెట్టెలలో సర్దించి, ప్రయాణములో నాకువలయు తినుబండారములు వేరుగ ఒకసజ్జలో నమర్చెను. నేను విద్యాలయమందెట్లు ప్రవర్తింపవలసినది, తోడిబాలికలతో నేనెట్లు కలిసి మెలిసి యుండునది, ఉపాధ్యాయినుల నేనెట్లు గౌరవింప వలసినది, చాలసేపు మా అమ్మ నాకు బోధించెను. ఆదినమంతయు మా అమ్మ నన్ను విడువలేదు. తపాలాముద్రయున్న కొన్ని కాగితపు సంచులను దీసుకొని, తనపై విలాసమును వాటిపై వ్రాసి నాకిచ్చెను. వారమునకొక యుత్తరము తనకువిధిగా వ్రాయు వలసినదిగ నాకు బోధించెను.

అమరునాడు ఉదయమే అల్పాహారమును గావించి నా ప్రయాణమునకు సిద్ధముగా యుంటిని. బండివచ్చి ద్వారము యెదుట నిలచెను. రైలుబండి వచ్చు వేళైనదని. శాస్త్రిజీ వచ్చి మా కెరింగించెను. సేవకులువచ్చి నా సామాగ్రినంతయు తీసుకొనిపోయి బండిలో బెట్టిరి. మా అమ్మ తన పవిటతో

కన్నీరు దుడుచుకొనుచు, నన్ను చేరదీసుకొని ముద్దుపెట్టు
కొనెను. నాకు కూడా దుఃఖమువచ్చెను. "శశీ! మీ అమ్మ
గారికి నమస్కరించి నీవు నా వెంటరమ్మా." అని శాస్త్రీజీ
నన్ను బుజ్జగించుచు బలికెను. నేనట్లుజేసి గది దాటితిని.
"శశీ" యని మా అమ్మ నన్ను బిలచెను. నేను వెనుకకు
తిరిగి మాఅమ్మ ముఖమును జూచితిని. ఆదృశ్యము నే నెన్న
టికిని మరువ జాలను. ఆమె తన రెండుచేతులను చాచి
యుంచెను. నేను పరుగునపోయి, ఆమె కౌగిలిలో బడితిని.
ఆమె నావీపును నిమురుచు, "శశీ! నాశశినెట్లు విడిచియుం
దు" నని పొంగివచ్చు తన దుఃఖమును దిగమింగుచు బలికెను.
అంతలో వేళగుచున్నదని మానాన్నగారు క్రిందినుండి కేక
వేసిరి. అప్పుడు మాఅమ్మ తనకన్నులు దుడుచుకొని, పిమ్మట
నాకన్నులను గూడ దుడిచి నన్నుబంపివేసెను. శాస్త్రీజీ మేడ
క్రింద నాకై వేచియుండెను. మెట్లక్రింద గంగ ఆమెకు కొంత
దూరములో మా పిన్ని నిలుచుని యుండిరి. వారితో మాట్లా
డకయే నేనేగుచుంటిని. "శశీ! నీవట్లేగుటతప్పు. మీపిన్నికి
నమస్కరించిరమ్మా" అని శాస్త్రీజీ నన్నుమందలించి తాను
ముందుగ బండి నెక్కెను. నేను వెనుకకుమళ్ళి మాపిన్నికి
నమస్కరించితిని. ఆమెనన్ను కౌగలించుకొని ముద్దుపెట్టు
కొనెను. గంగకూడ నన్ను కౌగలించుకొని ముద్దు బెట్టు
కొనెను. మా నాన్నగారు బండివద్ద నిలుచుని నన్ను రమ్మని
తొందర బెట్టుచుండిరి. నేనుబండి నధిరోహించునంతనే వే[illegible]

పలుకక మా నాన్నగారు నన్నెత్తుకొని బండిలో కూర్చొన బెట్టి తలుపు మూసిరి. బండికదలగనే శాస్త్రిజీ నన్నుపిలిచి మామేడపైకి తన వ్రేలును జూపెను. నేను పైకి జూచితిని. మాఅమ్మ తన గదికిటికీవద్ద నిలుచుని చేయియూపుచుండెను. మాబండి ఆవీధి దాటిపోవువరకు మాఅమ్మ నావైపు జూచుచునే యుండెను.

మాబండి డాక్టరుగారి యింటిముందునుండి వేగముగ బోవుచుండెను. నళినరంజనుని జూచుట మరచితిని. కాని నళినరంజనుడు చేయివిరిగి కట్టుకట్టుకొనినందున, నోట ఒక చిన్నమూటను కరచుకొని, పరుగునవచ్చి రెండవ చేయి సహాయమున వేగముగ బోవుచున్న బండినెక్కి, తలుపు బయట నుండియే ఆ మూటను నాకందిచ్చి తాను దిగిపోయెను, నేనప్పుడాతని చర్యను జూచి పకాలున నవ్వితిని. రుమాలు విప్పిచూడగా, అందు రెండు ఎర్రని సీమరేగుపండ్లుండెను.

మేము స్టేషనుకు వెళ్ళిన ఐదు నిమిషములకు రైలు బండి వచ్చెను. మేము మొదటి తరగతి పెట్టెలో నెక్కితిమి. రైలు ప్రయాణము చేయుట నాకదియే మొదటి పర్యాయము. మేమెక్కిన పెట్టెయందే కాళీగంజ జమీందారుని కుమారుడు ప్రఫుల్లచంద్రుడు మరొక పెద్దమనుష్యునితో ప్రయాణము చేయుచుండెను. ప్రఫుల్లచంద్రునకు సుమారు పదునారువత్సరము లుండును. అతడంత రూపసి కాడు. అదేమో కాని అతనియం దొకవిధమైన అలక్ష్యత, అసహ్యత నామనస్సునకు

చేర్పడెను. శాస్త్రీజీ వారితో చాలసేపు ప్రసంగించెను. వారి మాటలనుబట్టి ప్రఫుల్లచంద్రుడు కలకత్తా విశ్వవిద్యాలయము నందు "మెట్రిక్యులేషన్" చదువుచున్నట్లు నేను గ్రహించి తిని. అతడంత తెలివైనవాడు కాడనికూడ నే నెరింగితిని.. కొంతసేపైన పిమ్మట శాస్త్రీజీ నాకు వారి నెరింగించెను. ప్రఫుల్ల చంద్రుడు నన్ను పలుకరించెను. కాని నేను సమా ధానమొసగ లేదు. అతడు నాపేరడిగెను. దానికి గూడ నేను మాట్లాడలేదు. శాస్త్రీజీ నన్ను జవాబు చెప్పుమనెను. అప్పుడు మాత్రము నేను నాపెరును చెప్పితిని.

మరునాడుదయము మేము కలకత్తా చేరితిమి. స్టేషను వద్దకు నాతండ్రి స్నేహితు లొకరువచ్చి, మోటారుపై మమ్ము తమ గృహమునకు తోడ్కొనిపోయెను. మహాపట్టణమగు కలకత్తా జూచి నేనెంతయో ఆనందించితిని.

ఆసాయంకాలము బండిలో మేము కలకత్తా విడిచి కాశికి ప్రయాణమైతిమి. మాఅమ్మ జ్ఞాపకమునకు వచ్చినప్పు డెల్ల నేనేడ్చుచుంటిని. అది చూచి శాస్త్రీజీ నాకు ధైర్యము గొల్పుచుండెను. ఆమరునాడు తొమ్మిది గంటలకు మేము బనా రసు స్టేషను చేరితిమి. వెంటనే మేమొక మోటారుపై హిందూమహిళా విద్యాలయమును చేరితిమి.

ఆవిద్యాలయము భవనములు విశాలమైన చక్కటి ప్రదే శమందు నిర్మింపబడెను. మేమొక సుందరమైన భవనములోనికి ప్రవేశించినంతనే ఒకస్త్రీవచ్చి మమ్మొక పెద్ద గదియందు

కూర్చుండ జేసెను. మరొక నిమిషములో వేరొక స్త్రీ ఆగది లోనికి వచ్చెను. ఆమెయే ప్రధానోపాధ్యాయిని. ఆమెను గురుదేవియని పిలిచెదరు. ఆమెను జూచి నంతనే నాకొక విధమైనభక్తి ఆమెయందు జనించెను. ఆమె మాఅమ్మవలె చాల అందమైనది. గురుదేవి గదిలోనికి ప్రవేశించినంతనే శాస్త్రిజీ కుర్చీపైనుండి లేచి యామెకు నమస్కరించెను గురుదేవి యుచితరీతిని శాస్త్రిజీని మర్యాదజేసెను. గురుదేవి నన్ను తన దగ్గరకు దీసుకొని వంగభాషలో నన్నుకొన్ని ప్రశ్నలువేసెను. వాటికి నేను తగుసమాధానము చెప్పితిని. శాస్త్రిజీ మా కుటుంబ పరిస్థితులు, మా అమ్మను గూర్చియు ఆమెకు దెలిపెను. వారు హిందూస్థాని భాషలో మాట్లాడినందున వారి సంభాషణ నాకంత విపులముగ తెలియలేదు. నాకప్పటికి హిందుస్థానిభాష బాగుగ తెలియదు. గురుదేవి వసుంధరయను నొక వంగవనితను బిలచి, నాకు విద్యాలయమందు పరిచయము కలుగువంతవరకు నన్ను జాగరూకతో చూచుచుండుమని యామెకు దెలిపెను. వసుంధరాదేవి నాచేయి పట్టుకొని వసతిగృహము లోనికి నన్నుతీసుకొని పోవుచుండెను. అంతలో శాస్త్రిజీలేచి తాను శెలవుదీసుకొనెదనని గురుదేవితో చెప్పెను. శాస్త్రిజీ వెళ్లుచుండెనని నేనుగ్రహించి వెనుకకు తిరిగి "శాస్త్రిజీ! నన్ను విడిచి మీరు వెళ్ళెదరా?" యని దిగులు పడిన హృదయముతో ప్రశ్నించితిని, శాస్త్రిజీకి జాలివేసెను. ఆయనకొంత తడవాగి "శశీ! నీవు భయపడ

వలదు నీకిచ్చుట యెంతయో సౌఖ్యము చేకూరును. గురుదేవి నిన్ను తన కన్నబిడ్డవలె జూచుకొనును. నేను వచ్చి, నిన్ను దసరా సెలవులలో కాళీగంజిదీసుకొని వెళ్ళెదను." అని మంచిమాటలతో నన్నూరడించి బంపివైచెను.

వసుందరాదేవి నన్ను వసతిగృహములోనికి తోడ్కొని పోయి, నన్ను స్నానము జేయించి, తరువాత నాపెట్టెలోనుండి బట్టలు దీయించి, నేనవి వేసుకొనిన పిదప భోజన శాలలోని కొనిపోయెను. భోజనమైన పిమ్మట నన్ను మేడపైనొక చావడి లోనికి దీసుకొనివచ్చెను. ఆచావడిచాల విశాలముగను, అంద ముగను యుండెను. అందు మూడు పంక్తులు దీర్చి చాల మంచము లమర్చబడి యుండెను. "శశిరేఖా! నీవిందే కొంత తడవు విశ్రమింపుము చాలబడలిక జెందియుంటివి. సాయంకా లము మూడుగంటలకు వచ్చినేను నిన్నుదీసుకొని వెళ్ళెదను అని నన్నొక మంచముపై పరుండజేసి వసుంధరాదేవి వెళ్ళి పోయెను, రెండుదినముల ప్రయాణమువలన నేను చాల అలస టజెందియుంటిని. అందువలన నాకు చాలగాఢముగ నిద్ర పట్టెను.

ఆ సాయంకాలము తేనీరు త్రాగిన తరువాత వసుం ధరాదేవి నన్ను విద్యాలయమునకు ఆనుకొనియున్న చక్కటి తోటలోనికి గొనిపోయెను. వేరొకప్రక్క విద్యార్థినులు ఆట స్థలములో నాడుకొనుచుండిరి. కాని నాదృష్టంతయు మా యింటి వైపునను, మాఅమ్మ వైపునను యుండెను. వసుంధర

యది కనిపెట్టి నేనది మరచుటకు ఏదోయొక ప్రసంగములోనికి నన్ను దింపుచుండెడిది. సాయంకాలము భోజనములైన పిమ్మట విద్యార్థినులందరు ఎవరి మంచములపై వారు పరుండియుండిరి. నేను పరున్న తరువాత వసుంధరాదేవి నాకు ధైర్యము చెప్పి తాను పరుండుటకు నేరొక తావునకు వెళ్ళిపోయెను.

*　　*　　*　　*　　*

ఉదయము గంట వినబడినతోడనే విద్యార్థినులందరు నిద్రనుండి మేల్కాంచి త్వరితగతిని లేచి స్నానములు చేసి ప్రార్థనమందిరములోనికి బోవుచుండిరి. కొన్నాళ్ళవరకు వసుంధరాదేవి నాకవన్నియు బోధించుచుండెను. ప్రార్థన మందిరము దేవతా చిత్తరువులతో దివ్యముగ నలంకరింపబడి యుండెను. విద్యార్థినులు, ఉపాధ్యాయినులు వచ్చియుండిరి. వారి మధ్య గురుదేవి నిలువబడియుండెను. గురుదేవి మొదట కొన్ని శ్లోకములు చదివెను. పిమ్మట వేరొక బాలిక వచ్చి, భగవద్గీతలోని కొన్ని శ్లోకముల నతి శ్రావ్యముగ పఠించెను. తరువాత ఒకటిరెండు హైందవ కీర్తనలను చక్కగ పాడెను. ఆ బాలిక పేరెవ్వరని వసుంధరాదేవి నడిగితిని. ఆమె పేరు "లలిత" యని ఆమె చెప్పెను.

ప్రార్థనలైనపిమ్మట భోజనశాలలోనికేగి అల్పాహారమును భుజించితిమి. తరువాత బాలికలు ఎవరి తరగతికి వారు వెళ్ళిరి. నాకు మొదట బెంగాలి భాషలోనే చదువు మొదలా

పెట్టిరి. తరువాత ఒకగంట సంస్కృతము, మరొకగంట హిందూ స్థానీ నేర్పుచుండిరి. మాకు బెంగాలిలో పాఠములు వసుంధరా దేవియే చెప్పుచుండెను. ఆమెకు నాపై ప్రీతిమెండు, వసుంధరాదేవియు రూపసియనియే చెప్పవచ్చును. ఆమె వయస్సు సుమారు యిరువది సంవత్సరము లుండును.

కొన్ని దినములు గడచెను. ఆటపాటలందుబడి నను మాయింటి విషయముల నిప్పుడు అంతగా తలచుట లేదు. ఆట్టి బాలికలతో నేను కలిసి మెలిసి తిరుగుచుంటిని. వారిలో లలిత యనిన నాకుచాల సంతోషము. భోజన సమయమందును, పరుండబోయి నప్పుడును ఆమె మమ్ముల నందరిని కడు పుబ్బ నవ్వించుచుండును, ఆమెచుట్టును జేరి, యామె చెప్పు కథలాలకించుచుండెడి వారము. లలిత నాకంటె చాలపెద్దది. ఆమె కప్పుడు పదు నాలుగు సంవత్సరములుండును. ఆమె ఆల్మోరాలోని ఒక ధనికుని కుమార్తె ఆమె చక్కటి కురులు, విశాలనేత్రములు ఎవ్వరికైన ముగ్ధుల గావించుచుండును లలితకు మన దేశభాషలలో మంచి ప్రవేశము కలదు. ఆమెచాలా చురుకైనది. కాని చాలకొంటెది. ఆమె పాఠశాలయం దెవ్వరిని లక్ష్యముచేయదు. వసుంధరాదేవికి లలితకు మధ్య పచ్చగడ్డి వేసిన భగ్గుమనుచుండెను.

మా అమ్మవద్దనుండి తరుచు ఉత్తరములు వచ్చుచుండెను. నను విధిగా ప్రతివారము ఒక ఉత్తరము వ్రాయుచుండెడి దానను. దసరాపండగ సమీపించుచుండెను. సెలవులకై నిరీ

సించుచుంటిమి. సెలవులకు ఒకవారము దినములకు ముందుగ గురుదేవి నాకై కబురుబంపెను. నామనస్సు చాల ఆందోళన జెందెను. గురుదేవి చాల ప్రేమతో నన్ను తనదగ్గరకు దీసుకొని “శశిరేఖా! ఈదినమే గంగాధరశాస్త్రిజీ వద్దనుండి నాకొక ఉత్తరము వచ్చియుండెను. మీ అమ్మగారు అస్వస్థతగయుండుట వలనను, మరి వేరె కారణముల వలనను, నిన్ను ఈ సెలవుకు కాశీగంజికి దీసుకొనిపోవుటకు వీలులేదనియు, ఇచ్చటనే నీకు తగుయేర్పాట్లు నేను గావించునట్లును ఆయన వ్రాసియుండెను. కనుక నీవు విచారించక యిచ్చటనే యుండుము. వసుంధరాదేవికూడ నీతో సెలవుదినములందిచ్చటనే యుండును.” అని చెప్పెను. ఆమాటలు వినినతోడనే నాగుండెలో రాయి బడినట్లయ్యెను. నాతలిదండ్రులకు నేను బరువైతినని, తోడిబాలిక లెక్కడ నన్ను చులకన జేయుదురోయని నేను చింతించితిని. సెలవు లివ్వగనే అతిసంతోషముతో బాలికలు ఉపాధ్యాయినులు తమ తమ గృహముల కేగిరి. నేను, వసుంధరాదేవి మరియిరువురు పాధ్యాయినులు, ఒకవంటకత్తె తక్క విద్యాలయమం దెవ్వరును లేరు. లలిత తాను వెళ్ళునప్పుడు చలోక్తిగా నాతో వసుంధరాదేవిని కనిపెట్టుచుండుమనెను.

సెలవు దినములందు ప్రతియుదయము వసుంధరాదేవి నన్ను పట్టణములోనికి తోడ్కొని పోవుచుండెడిది. మేము తిరుచు దేవళములోనికి బోయి, దేవదర్శనము గావించుకొనిన పిదప, పట్టణము సందడి కట్టడములను తదితర వింతలను

జూచుటకేగెడి వారము, సాయంకాలము విద్యాలయ మందలి తోటలోనే కూర్చొనెడి వారము. తరుచు సాయంకాలమందు సదానంద్ వచ్చి మాతోటలోనే కూర్చొనుచుండెడివాడు. సదానంద్ ఆపట్టణములోనే ఒకకళాశాల యందధ్యాపకపదవి యందుండెను. ఆతడు యువకుడు. మావిద్యాలయమునకు సమీపమునందే చిన్నయింటిలో నివసించుచుండెను. మొదటి దినము వసుంధర నన్నాతని యొద్దకు దీసుకొని వెళ్ళి "ఈమె పేరే శశిరేఖ" యనెను. అప్పుడాతడు తన సంతసమును దెలిపెను. తరువాత నేను కొంచెము దూరములోనే బంతి నాడుకొనుచుంటిని. వసుంధరా సదానందులు ఒక చెట్టుక్రింద బల్లపై కూర్చొని చాల సేపెద్దియో మాట్లాడుకొని, పిమ్మట నెమ్మదిగ నడచి వసతి భవనములోనికి ప్రవేశించిరి. పండగ దినమందాతడు మాతోనే భుజించెను. ఆమరునాడు సాయంకాలము వెన్నెలవచ్చిన పిదప భోజనముగావించి తనగది లోనికి పోయెను. ఆమె చక్కగ అలంకరించుకొని నావద్దకువచ్చి, "శశిరేఖా! శశిరేఖా! నీవు పరుండుము. సదానంద్‌కు ఈదినము తీవ్రముగ జ్వరము వచ్చెను. ఆతనిని జూచి నేను త్వరగవచ్చెదను." అని నన్నుపరుండజేసి, ఆమె భవనమును విడిచి, వెళ్ళెను. కాని నాకునిద్దురబట్టలేదు. మాభవనమునకు సమీపమునరోడ్డుపయి నెవరో హిందుస్థానీలో చక్కగ పాటపాడుచు వెళ్ళుచుండిరి. నేనప్పుడు హిందుస్థానినేర్చుకొనుచున్నందున ఆపాట వినుచునే పల్లించుకొన గలిగితిని అది శృంగారరక్తి

మని నాకు తరువాత చాలకాలమునకు తెలిసెను. ఆ మొదటి చరణము నాకింకనూ జ్ఞాపకమున్నది.

"ప్రేమబంధ హాతసే మిలాహో పారవశ్యహో
తుమహామె సంగమిలన ప్యారదోస్తు దిల్‌సే కంపహో"

వసుంధర వచ్చునప్పటికి చాలా రాత్రయ్యెను. ఆమె ఆయాసముతోను, తొట్రుపాటుతోను గదిలోనికి వచ్చెను. "సదానంద్‌కు జ్వరము హెచ్చుగా యుండెనా?" అని నే నామెను ప్రశ్నించితిని. "లేదు నయమయ్యెను." అని మాత్రము ఆమె నాకు బదులుచెప్పెను. కాని మరేమియు చెప్పలేకపోయెను. వసుంధర కొంతసేపు నిదానించి, పిమ్మట "శశిరేఖా! ప్రార్థన జేయుట మనము మరచితిమి నీవులేచి రెండుశ్లోకములను చదువుము." అనినాతో బలికెను. అప్పుడు నేను లేచి మా ప్రార్థన పుస్తకమును తెరచి కొన్ని శ్లోకములను చదివితిని. అది చదువుచున్నప్పుడామె కన్నులనుండి నీరుగారు చుండెను. ఆమె అస్వస్థతగ యుండెనని నేను తలంచితిని. కాని ఆమె కొంచెము జలుబు చేసినదని మాత్రము బలికి యున్న నిద్దురపొమ్మనెను. సగము రాత్రియందు నాకు మెలకువ వచ్చెను. వసుంధర పరుండి ఎక్కిళ్ళెక్కి ఏడ్చుచుండెను.

# అధ్యాయం ౪

బాలిక లందరు విద్యాలయమునకు తిరిగి వచ్చిరి. వారి కంతా యింటిపైదృష్టికలిగియేయుండెను. లలితమాత్రము ఎప్పటివలె సంతోషస్వాంతయై యుండెను. ఆ రాత్రి పరుండుటకు ముందు లలిత నామంచముపైకి వచ్చి, సెలవులందు నేనెట్లు గడపినది తెలుపగోరెను. మేము పట్టణములో చాల స్థలములకు వెళ్ళి జూచితిమనియు, సగతోషముగ గడపితిమనియు చెప్పితిని. "ఏమీ! నీవు వసుంధర విసుగుబుట్టించు ఈ విద్యాలయ భవనమందుండి సంతోషముగ గడపితిరా?" అని లలిత ప్రశ్నించెను. మేము మరి యిరువురు ఉపాధ్యాయినులు విద్యాలయమందుంటి మనియు తరుచు సదానందు వసుంధరా దేవి వద్దకు వచ్చుచుండెడివాడనియు చెప్పితిని.

"ఏమీ! సదానందు యిచ్చటకు వచ్చుచుండెనా?"

"అవును. ఆతడు పండగ దినమున మాతో భుజించెను. అయినా డాతనికి తీవ్రమైన జ్వరము వచ్చెను. ఆరాత్రి వసుంధరాదేవి ఆతనికి పరిచర్యలు జేయుటకై బసకు వెళ్ళి చాలరాత్రికి తిరిగివచ్చెను." అని నేను జవాబు చెప్పితిని. అది వినగనే లలిత తనలో నవ్వుకొనెను.

నాలుగైదు దినములకు పిమ్మట ఒకనాటి రాత్రి మే మందరము సభ తీర్చినట్లు ఒకచోట గుమిగూడి యుంటిమి. లలిత మామధ్య కూర్చొని సెలవు దినములందు తానెట్లు గడిపి నది చెప్పుచు మమ్ము నవ్వించుచుండెను. అంతలో వసుంధరా దేవి యచ్చటకువచ్చి "లలితా! నీ కెన్ని పర్యాయములు చెప్పినను బుద్ధి రాకున్నది. ఈ క్షణమే నీస్థలములకు బోయి పరుండుము" అనెను బాలిక లెవ్వరి స్థలములకు వారు పరు గెత్తుకొని పోయిరి. మా ఖమి సగము గప్పుకొని నేను నా పక్కపై పరుండియుంటిని. లలితమాత్రము ఆ స్థలమును వీడ లేదు.

"లలితా! నీకు పెంకితనము హెచ్చుగుచుండెను. నీ విచ్చటనుండి ఈ క్షణమందే పొమ్ము లేనిచో గురుదేవితో జెప్పి నీపని బట్టించెదను. నీమూలముననే ఈ బాలిక లందరు పాడగుచుండిరి."

"అట్లే చేయుము. నీకు ధైర్యము కలదేని గురుదేవితో ఈ రాత్రే జెప్పుము. రేపు వుదయము నేను మరొకటి జెప్పెదను."

"ఓసీ ( మూర్ఖురాలా! నీ వేమి జెప్పెదవు?"

"నేనేమి జెప్పునది నీకవసరము లేదు. నేనే మూర్ఖురాల నైన నీవు తుంటరివి. నీ అవినీతికరమగు చేష్టలవలన ఈ బాలి కలు పాడగుచుండిరో లేక నా పెంకితనమువలన పాడగుచుండిరో గురుదేవికే నేజెప్పించెదను." అనిలలిత పలికినంతనే వసుంధర

యొక్క మోము కళావిహీనమయ్యెను. ఆమె నావైపు జూచి నోటిలో నద్దిదమో గొణుగు కొనుచు, ఆచావడి విడిచిపోయెను. ఈ తగవునకు సగము నేనే కారకురాల నైనందున చాలా పశ్చాత్తాపము జెందితిని.

ఆమరునా డుదయము వసుంధరాదేవి కనబడుటలేదని గుసగుసలు ప్రారంభమయ్యెను. మరొక అరగంటలో సదా నందుకూడ కానబడుట లేదని పుకారుబుట్టెను.

నాకు చాల దుఃఖము వచ్చెను. నేను వసుంధర కొరకై యేడ్చుచుంటినని గ్రహించి బాలిక లందరు నన్నో దార్చగిరి. అంతలో ఒక ఉపాధ్యాయుని వచ్చి, గురుదేవి రమ్మనుచుండెను అని జెప్పి లలితను తన వెంట దీసుకొని వెళ్ళెను. గంటసేపయ్యెను. కాని లలిత రాలేదు. మధ్యాహ్నమువరకు ఏమి జరిగినది, తెలియలేదు. అప్పు డొక ఉపాధ్యాయుని వచ్చి, నన్ను గురుదేవివద్దకు దీసుకొని వెళ్ళెను. గురుదేవికి కొద్దిదూరములో లలిత బల్లపై కూర్చొనియుండెను. నాగుండెలు కొట్టుకొనుచుండెను.

"శశిరేఖా! నీవు భయపడవలదు ఇటురమ్మ" అని నా చేయి బట్టుకొని గురుదేవి తనదగ్గర దీసుకొనెను.

పిమ్మట నేను లలితతో వసుంధరాదేవినిగూర్చి యేమి బలికినది తెలుపమనెను. నేను ఉన్నది యున్నట్లు వచించితిని. అది వినినపిదప గురుదేవి నన్ను నాతరగతిలోనికి బంపివేసెను. ఆ సాయంకాలము లలితమాకు కనబడలేదు, మరునాడుదయము

మూమె నవ్వుచూ వసతిగృహములోనికివచ్చి "నేని పాఠువిద్యాలయమును వదలిపోవుచుంటిని. అనిపలికి తనసామానెల్ల సర్దుకొనుచుండెను. బాలికలందరు లలిత వెళ్లుచున్నందుకు చాలా విచారించిరి.

కొంతకాలము గడచెను. మా అమ్మకు చాలజబ్బుగానున్నందున నన్ను వెంటనే కలకత్తాకు బంపునట్లు, అచ్చటనుండి శాళీగంజికి తాను తీసుకొని వెళ్లునట్లు, శాస్త్రిజీ వద్దనుండి గురుదేవికి ఒకఉత్తరము వచ్చెను. గురుదేవి నన్నుబిలచి నా ప్రయాణమునకు వలయు ఏర్పాట్లుగావించెను.

నేను శాళీగంజి చేరునదికి మా అమ్మ జీవముతో యుండునో లేదోయని నేను చాల ఆత్రుత పడితిని. ఇందిరాదేవియను ఒక ఉపాధ్యాయిని నా వెంట స్టేషను వద్దకువచ్చి, కలకత్తాకు రైలు టిక్కెట్టును కొనియిచ్చి, నన్ను మొదటి తరగతి పెట్టెలో నెక్కించెను. మరునాడుదయము బండి హౌరా చేరెను. శాస్త్రిజీ వచ్చి స్టేషనువద్ద నన్ను కలుసుకొనెను. శాస్త్రిజీని జూచినంతనే నేను దుఃఖమును బట్టలేక పోతిని. శాస్త్రిజీ నన్నూరడించి బనకు గొనిపోయెను. ఆసాయంకాలము కలకత్తానుండి మేము శాళీగంజికి ప్రయాణమైతిమి.

మేము ఇంటికి వెళ్ళునరికి డాక్టరుబాబు అచ్చటనేయుండెను. శాస్త్రిజీ నన్ను మా అమ్మవద్దకు దీసుకొనివెళ్ళి, నేవచ్చి నట్లామెకు దెలియజేసెను. నేను వచ్చినంతనే మా పిన్ని, మా నాన్న గారు మా అమ్మగదిలోనికి వచ్చిరి.

మా అమ్మస్థితి జూచి నాహృదయము నీరయ్యెను. మా అమ్మ తన కన్నులను విప్పి నన్ను దీర్ఘముగ జూచెను. నిర్బలస్వరముతో ఆమె "శశీ! నాశశీ వచ్చితివా? యని తనచేతులు జాపెను. ఆమె చేతులలో నేనెంతసేపు పడియుంటినో నాకు తెలియదు. డాక్టరు మొదలగు వారెల్ల మాఅమ్మ నా [illegible] మార్పునకు జూచి ఆశ్చర్యమును పొందిరి. ఆమె [illegible] రెండురోజులనుండి మాటయే కట్టుబడి యుండెను. నన్ను జూచినంతనే యామెకు లేనిశక్తి కలిగెను. ఆదినమంతయు మాఅమ్మ నన్ను విడువలేదు. విద్యాలయమందు నావిద్యా విషయములను గూర్చియు, నాఆటపాటలను గూర్చియు నడిగి తెలిసికొనెను. ఆమె నన్ను పలుమారు ముద్దిడుకొనెను. అప్పటి మాఅమ్మ స్థితిజూచి, ఆమెకు జబ్బు నయమై మరికొన్నాళ్ళు జీవించు ననుకొంటిని. కాని దైవము వేరు విధముగ జేసెను. ఆ రాత్రి మాఅమ్మ తన జీవితమును చాలించెను.

*    *    *    *    *

మాఅమ్మ చనిపోయిన పిమ్మట నాతండ్రి గృహమందు నాకు స్థానములేక పోయెను. ఇంటబుట్టిన బాలికకు జరుగ వలసిన ముద్దు ముచ్చటెల్ల నాకు మారుగ గంగకే యథారీతిని జరుగుచుండెను. ఇంటియందేయుండి ఆమెకు జదువు జెప్పుటకు ఒక ఉపాధ్యాయుని నియమింపబడెను.

నళినరంజనుడు కలకత్తాలో చదువుచుండెను. అందు వలన అతన్ని నేను చూడ లేకపోతిని. మాఅమ్మపోయిన పదినైదు

దినములకు మాపిన్ని నాప్రయాణమునకు సన్నాహమెల్లజేసెను. నేను తిరిగి కాశీవచ్చి, విద్యాలయమందు ప్రవేశించితిని.

వసుందరాదేవి మావిద్యాలయమును విడిచి వెళ్ళిన పిమ్మట ఇందిరాదేవియే నాకు వంగభాషలో విద్య గరపుచుండెడిది, ఆమె నాపట్ల ఎంతయో శ్రద్ధవహించుకొనుచుండెను.

గురుదేవి నన్ను చాల ప్రేమతో జూచుచుండెను. ప్రార్థనలందు పాల్గొనుట నాకు చాల యిష్టముగ యుండెడిది. బహుశః అదిగురుదేవి అభిమతమువలన అయియుండవచ్చును. లేక సంగీతముపై నాకుగల అభిరుచియై యుండును. క్రమముగ నామనస్సు మతముపైనను, మతవిషయిక గ్రంథములపైనను బడెను.

నేను విద్యాలయ మందున్నంత కాలము మానాన్న గారు నన్ను కాళీగంజి దీసుకొని వెళ్లుటకై ఎవ్వరినీ బంపలేదు. గనుక నాబాల్యమంతయు విద్యాలయమందే గడపితిని చెప్ప వచ్చును. సెలవు దినములలో తరుచు గురుదేవి నన్ను తన వెంట తినసస్థలమగు నేనీటాల్‌కు దీసుకొని పోవుచుండెడిది. నేనీటాల్ చక్కనిప్రదేశము .అది హిమాలయ పర్వతములకు చేరువనే యుండెను. నా సెలవు దినములు నేనీటాల్‌లో గడపుట నాకు చాల సౌఖ్యమును చేకూర్చెను. ఇట్లుకొన్ని సంవత్సరములు గడచిపోయెను. బెంగాలీ హిందుస్థానీ, భాష లందు మంచి మంచిపాండిత్యమును బడసితిని. సంస్కృత మున కావ్యనాటకాలంకారములను చక్కగ అభ్యసించితిని. ఆంగ్లేయభాషలో మంచి మెప్పును పొందితిని.

కాళీగంజినుండి తరుచు నాకు ఉత్తరములు వచ్చుచుండెను. అప్పుడప్పుడు గంగ నాకు ఉత్తరములు వ్రాయుచుండెడిది. ఆమె వ్రాసిన ఉత్తరములందు తాను పాల్గొనిన విందుల సంగతులు, వివాహములసంగతులు, తాను చేయించుకొనిన నగలు సంగతులు తక్క వేరొండు విశేషము లుండెడివి కావు. తనకు దీరికయైనప్పు డెప్పుడో మాసిరిని వ్రాయుచుండెడిది. ఆమె ఎన్నడు వ్రాసిననూ, నాచదువుకై నాకు వలయు పుస్తులకై చాలధనము వ్యయమగుచుండెనని చింతించుచుండెడిది మానాన్నగారివద్దనుండి ఉత్తరమెన్నడునూ లేదు.

శాస్త్రిజీ మాత్రము నాకు తరుచు అన్ని సంగతులతో ఉత్తరములు వ్రాయుచుండెను. మానాన్నగారు పరిశ్రమల నెన్నియో స్థాపించి చాల ధనము నార్జించుచుండెను. వేల కొలది కార్మికులను పోషించుచుండెను. కాళీగంజి ఇప్పుడు పట్టణమయ్యెను. దివ్యభవనములతోను, చక్కని బాటల తోను, పెక్కు మోటారుబండ్లతోను, కర్మాగారములతోను, గొప్ప వాణిజ్యకేంద్రముగా విరాజిల్లుచుండెను. కాళీగంజి జనాభా నాలుగురెట్లు హెచ్చు పెరిగెను. కాళీగంజి అభివృద్ధికి నాతండ్రియే ప్రధానసంధాత. ఆయన కాళీగంజి కిప్పుడు ముకుటము లేని మహీపతి యయ్యెను. ఆయన కీర్తి యశస్సులు వంగ దేశమందేగాక దేశమంతటను వ్యాపించెను. కాని నాతండ్రియందు దైవభక్తి, దైవభీతి నశించుచుండెను.

మాసిన్ని తన కుమార్తెయగు గంగాభవానికి ప్రపంచములోనున్న ఆడంబరమంతయు దెచ్చిపెట్టుచుండెను. సంసార సౌఖ్యమగు నడవడిక గంగయందు చాల తక్కువ.

మాతోటమాలి కృష్ణదాసు, ఎవరు నాకు ఉత్తరములను వ్రాసినను తన అభివందనములను నాకు బంపుచు క్షేమమారయుచుండెడివాడు.

నళినరంజనుడు కలకత్తాలో డాక్టరు పరీక్షను జదువుచుండెను. కాని అతని దృష్టంతయు హిమాలయశిఖరారోహణమందే యుండెను. సముద్రముపై నశించు పక్షిని గూర్చియుందిడిన, సముద్రకెరటములపైకి మరల పోనుంకించునట్లాతడుండెను.

కాళీగంజ జమీందారుడు చనిపోయెను. అతని కుమారుడు ప్రఫుల్లచంద్రముఖర్జీ కలకత్తాలో తన చదువు చాలించుకొని దుష్టసహవాసములు చేసి ధన మెల్ల వ్యయము గావించుచుండెను. జమీందారు చనిపోవుటకు ముందు తన కుమారునకు వివాహము చేయవలెనని తలచెను. కాని అతని కోరిక సఫలముగా లేదు.

వీలగునపు డెల్ల నేను మతవిషయిక గ్రంథములను జదువుచుంటిని వివిధమత సిద్ధాంతములను నేను దెలిసికొనుచుంటిని. విద్యామతముల రెంటికిని సేవజేసి, దేశసౌభాగ్యమునకు తోడ్పడి నాజీవితమును నందుల కర్పించవలెనని నాకు కోరిక జనించెను. నామనోనిశ్చయమును గురుదేవికి

గూడ నేనింకనూ జెప్పలేదు. అప్పుడు నావయస్సు పదు నెనిమిది సంవత్సరములు.

ఇట్లుండ ఒకనాడు గురుదేవికి నాతండ్రివద్దనుండి ఒక ఉత్తరము వచ్చెను. నన్ను తీసుకొని వెళ్ళుటకై తాను కాశికి వచ్చుచున్నట్లందు తెలియబరచెను.

* * * * *

నామనస్సు నందలి కోరికలెల్ల బుగ్గియయ్యెను. నా జీవితమందెట్టి మార్పు కలుగనున్నదో నాకు తెలియదు. ఆదినమంతయు నే నేడ్చుచునే యుంటిని.

మరునాడుదయము పదిగంటలకు మానాన్న గారు వచ్చి గురుదేవితో మాట్లాడుచున్నట్లు నాకు తెలియజేయబడెను. నేనచ్చటకు వెళ్ళితిని. మానాన్నగారి తల గడ్డము మునుపటికంటె కొంచెము నెరసియుండెను. దానికిమించి వేరు మార్పు ఆయనయందు నాకేమియు కనబడలేదు. మానాన్న గారు నన్ను దగ్గరకు తీసుకొని తన ప్రక్కను కూర్చుండబెట్టుకొని. “ శశీ! నీకు మీ అమ్మపోలిక వచ్చెను. ” అని పలికెను.

తరువాత మానాన్నగారి కార్యదర్శి గంగూలిదాదా గురుదేవితో “ మీరు తగిన శ్రద్ధదీసుకొని శశిరేఖాదేవిని విదూషిని గావించినందులకు బాబూ సాహెబ్ రమేశచంద్రదత్తు, వారికుటుంబము మీకెంతయు కృతజ్ఞులు. ఇప్పుడు శశిరేఖాదేవికి పదునెనిమిది వత్సరములు ముగియుచుండెను-

ఆమె వివాహమునకై తగు యేర్పాట్లుగావింపబడెను. ఆమెను గొనిపోవుటకై వారిచ్చుటకు వచ్చియుండిరి." అని చెప్పెను.

"ఏమిా! శశిరేఖకు భర్తనుగూడ జూచియుంటిరా? అని గురుదేవి ఆశ్చర్యపడెను.

"అవును. చూచియుండిరి."

"మహాశయా! అదిమిాకు ధర్మమా—"

"గురుదేవీ! అది ధర్మవిరుద్ధమెట్లగును?" అనిగం గూలి బలికెను.

"శశిరేఖ గతపదిసంవత్సరములనుండియు, నా యొద్ద విద్య నభ్యసించుచుండెను అప్పటి నుండియు తమరు ఆమె యోగక్షేమముల నారయలేదు. తల్లి చనిపోయిన పిమ్మటామెను ఒక్కమారైన స్వగ్రామము దీసుకొని వెళ్ళలేదు. కుటుంబ పరిస్థితులుగాని, బంధుపరిస్థితులుగాని యామె కొకింతయు తెలియవు. విద్యాజ్ఞానముల నధికము బడసిన యామెయుద్దేశములను అభీష్టములను గ్రహింపకయే యామెకు వివాహ మొనర్చుట చాల అన్యాయము" అని గురుదేవి పలికినంతనే నాతండ్రికి కోపము వచ్చెను. తరువాత నావివాహవిషయమై నాతండ్రికి గురుదేవికి మధ్య చాల వాద ప్రతివాదములు జరిగెను. ఆయనముఖము కోపము వలన ఎఱ్ఱబడెను. తుదకు గురుదేవితో—

"మిారట్లనుట భావ్యముకాదు. దాని విద్యాభ్యాసము నకై నేను చాల ద్రవ్యమును వెచ్చించితిని. ఆమె ఎవ్వరు

జన్మించెనో, అప్పటినుండియు దాని బాధ్యత నాపైె యుండెను. నాకు నా కుమార్తెపై గల వాత్సల్యవ్యామోహములు ప్రపంచము గ్రహింపకపోయినను, నావిద్యుక్తధర్మము లెవ్వియో నాకు తెలియును. నాకుమార్తె కెట్టి సంబంధము చేయవలెనో, ఎట్లు జేసిన యామె సుఖించునో నాకు దెలియును. మీయొద్ద నేనీ సంగతులెల్ల విశదీకరించివలసిన యవసరము లేదు. ఈ సాయంకాలము నా కార్యదర్శి వచ్చి, నాకుమార్తెను నాబసకు దీసుకొని వచ్చును. దయచేసి మీరు సిద్ధబరచుడు." అని చెప్పి నాతండ్రి ఆగది విడిచి వెళ్ళెను. నే నిదంతయు జూచి నిర్ఘాంత పోతిని. నామనస్సు చాల ఆందోళనయందు పడెను. గురుదేవి తన మృదుమధుర వచనములతో నాకు మనోశాంతిని కలుగ జేసెను. నే నచ్చట యే స్థితియందున్నను తనకు తరుచు నా క్షేమములు దెలియజేయుమని కోరెను.

* * * * *

ఆ సాయంకాలము నాతండ్రి కార్యదర్శి వచ్చి నన్నొక పెద్ద హూటలునకు దీసుకొనిపోయెను. పై అంతస్థులో మా నాన్నగారు బస జేసియుండిరి. భోజనమైన తరువాత మా నాన్నగారు నావివాహ విషయమై నాతో ప్రసంగించిరి. కాని వారు చెప్పుదానికి అడ్డు ప్రశ్నలు వేయుటకుగాని, నాఅయిష్టత దెలువుటకుగాని నాకవకాశము, ధైర్యము లేకపోయెను.

మానాన్నగారు తన స్వశక్తిచే ఔన్నత్యమునకు వచ్చిరి. కాని కేవలము ధనరాసు లాయనను తృప్తిబరుపలేకపోయెను. తన వంశమును కీర్తివంతముగను, చిరస్థాయిగను జేయవలె ననెడి దృఢమైన కోరిక చిరకాలమునుండియు ఆయనకు గలదు. నా తండ్రికి కుమారుడే యుండిన ఆ సంకల్ప మెల్ల యీడేరి యుండును. కాని ప్రారబ్ధవశమున కుమార్తెనై జన్మించి యుండుటచే వేరొక విధముగ యోచించెను. నన్నొక గొప్ప కుటుంబములో బడనైచిన తనకోరిక ఫలించునని నమ్మియుండెను. అందుచే కాళీగంజి జమీందారుడగు రాజా ప్రఫుల్లచంద్ర ముఖర్జీని తన యల్లుని గావించుకొనుటకు తగిన యత్నములు జేసుకొనెను. రాజా ప్రఫుల్లచంద్రుని ఆర్థికపరిస్థితు లెట్లున్నను వాటి నన్నిటిని తన యర్థబలముచే సరిజేసి నన్నాతని కిచ్చి వివాహ మొనర్చుటకు నిశ్చయించెను.

తన స్వంత పనులు కొన్ని యుండుటచే నాలుగుదినముల వరకు మా నాన్నగారు కాశీలోనే యుండిరి. మా నాన్నగారు నాకై చాల విలువగల చీరెలు మొదలగువాటిని కొనిపెట్టిరి. ఒకనాటి సాయంకాలము నేను బండిపైయెంటరిగ విశ్వనాథుని ఆలయమును జూచుటకు వెళ్ళి తిరిగి వచ్చుచుండ, ఒక యువకుడు నాకు యెదురుగ వచ్చి, నామోమువంక జూచి నవ్వుచు "శశీ!" యని బిలచి నాచేయి బట్టుకొనెను. నాహృదయము కొట్టుకొనెను. నాతల కొంచెము తిరిగినట్లయ్యెను. నేనాతని ముఖమును జూచితిని కాని మాటలాడలేదు.

" శశీ! నేను జ్ఞాపక ముంటినా ?" అని యాతడు మృదువుగ బలికెను.

నా కానందము తరలివచ్చెను ఆత డెవ్వరో నేను దెలిసికొంటిని. ఆతడు నా బాలమిత్రుడగు నళినరంజనుడు. ఆత డిప్పుడు ఆజానుబాహు డయ్యెను. నళినరంజను డిప్పుడు చాల బలయుతముగ యుండెను. కాని ఆతని ముఖము మాత్రము మార్పు జెందలేదు. తరువాత నళినరంజనుడు నన్నొక బండిలో కూర్చుండబెట్టి, నాప్రక్కనే తానునుకూర్చొనెను, తనవృత్తాంత మెల్ల నాకు జెప్పెను.

నళినరంజను డెట్లో లవ పరీక్షయందు కృతార్థుడననిపించుకొని, డాక్టరు పట్టాను పొందెను. పాశ్చాత్యులు కొందరు హిమాలయపర్వతారోహణమునకై మన దేశమునకు వచ్చి, ముందుగ కలకత్తా చేరిరి. నళినరంజనుడు వారిని కలసికొని, తన యుత్సాహమును వారికి తెలియజేసెను. తమకు తగు వైద్యసహాయముకూడ యుండుననే తలంపుతో నళినరంజనుని వారు ఆహ్వానించిరి. వారు కాశ్మీరమార్గమున పర్వతారోహణమున కేర్పాట్లు గావించుకొనిరి. కాని వారు కలకత్తానుండి బయలుదేరుట కింకనూ వారము దినములు వ్యవధియుండుటచే నన్ను జూచుటకు నళినరంజనుడు కాశికి వచ్చెను. అంతలో మేమిచ్చట కలిసికొనుట తటస్థించెను. నేను విద్యాలయమును విడిచి కాళీగంజి వెళ్ళుచున్నట్లు, నావివాహమునకు ప్రయత్నములు జరుగుచున్నట్లు నేనాతనికి తెలియబరచితిని. నళిన

రంజను డాశ్చర్యచకితుఁ డయ్యెను. "వివాహమా? ఎప్పుడు? ఎవరిని?" అని తొందరగ బ్రశ్నించెను.

వివాహ మెప్పుడు జరుగునది నిశ్చయము కాలేదనియు, వరుడు రాజా ప్రఫుల్లచంద్రుఁడనియు బదులు జెప్పితిని.

"ఏమీ? రాజా ప్రఫుల్లచంద్రుఁడనా? నిక్కముగనా? నీకు బాగుగ దెలి......... ..."

అతఁడు చెప్పునది పూర్తిగ వినకుండగనే నాకితరసంగతులు బాగుగ తెలియువనియు, ప్రఫుల్లచంద్రుని నేను విద్యాలయమునకు వచ్చిన పిమ్మట చూడలేదనియు చెప్పితిని. మా నాన్న గారే ముందుగ అన్ని యేర్పాట్లు జేసియుండిరని కూడ చెప్పియుంటిని.

"ఇంత కాలమునుండియు నీవాతని చూడనే లేదు... ... ...మీనాన్నగారే అన్ని యేర్పాట్లు జేసియుండిరి." అని దీర్ఘవిశ్వాసమొనర్చి నళినరంజనుఁడు బలికెను. నళినరంజనుఁడు నాతో మాబసకు వచ్చెదనని చెప్పి బండి తిన్నగ మేమున్న హూటలునకు పోనిచ్చెను.

"నేను మానాన్న గారితో మాట్లాడవలసి యుండెను. కాని ఆయన నన్ను మాట్లాటనిచ్చునా యని సంశయము పడుచుంటిని."

"నళినీ! వారు నీతో సంతోషముగ మాట్లాడెదరు. సంశయింపనేల?" అని నుడువుచు వేగముగ మేడ మెట్లెక్కి మానాన్నగారి గదిలోనికి ప్రవేశించి యుత్సాహముతో నేను

"నాన్నగారూ! మిమ్ము జూచుటకు నావెంట ఎవరు వచ్చిరో మీకు దెలియునా?" అని యడిగితిని. కాని నా యుత్సాహ మెల్ల నశించెను. నళినరంజనుని జూచి మానాన్నగా రెట్టి సంతసమును వెలిబుచ్చలేదు.

"బాబూసాహెబ్! నే నెవరినో మీకు జ్ఞాపకము లేదా?" యని నళినరంజనుడు గౌరవయుతముగ ప్రశ్నించెను.

"క్షమింపుడు. నాకు జ్ఞాపకము లేదు" అని నాతండ్రి పలికినంతనే, నేను నళినరంజనుని ఆయనకు పరిచయ మొనర్చితిని. పిమ్మట వారిరువురు హిమాలయపర్వతారోహణమును గూర్చి ముచ్చటించిరి. తరువాత నళినరంజనుడు వెళ్ళుటకు లేచెను. అప్పుడు మానాన్నగారు "నళినరంజన్! నీ వ్యాపకమును వినిన నాకు నవ్వు వచ్చుచున్నది. ఒక్క పైసకూడ సంపాదించుటకు వీలులేని పర్వతారోహణము జేసి నీవు ఉద్ధరించున దెవరిని? కానిమ్ము, మంచిచెడ్డలు నీకే తెలియు గలవు. నీవింక సెలవు దీసుకొనవచ్చును." అనెను. నళిన రంజనుని సాగనంపుటకు నేను మేడ క్రిందికి వెళ్ళితిని.

"శశీ! మీనాన్నగారితో నేను చెప్పవలసిన సంగతులు చాల గలవు. కాని చెప్పుటకు వీలు కాలేదు. నేను కాళీగంజి వచ్చుటకు సుమారు నాలుగు నెలలయినను బట్టును. అంత వరకు నీవివాహము జరుగకయున్న చాల మంచిది. ఏమైనను కానిమ్ము. నీవు కాళీగంజి వెళ్ళిన పిదప సంగతు లెల్ల తెలియు గలవు. నేను మీనాన్న గారికి ఒక లేఖ వ్రాసెదను." అని నళినరంజనుడు నాతో చెప్పి వెళ్ళిపోయెను.

## అధ్యాయం ౫

మేము కాశీ విడిచి కలకత్తా చేరితిమి. మా నాన్నగారి స్నేహితులు, చాలమంది నగరవాసులు, కార్మికులు ఆయనకు ఘనమగు స్వాగత మొసగిరి. కలకత్తాలోని పెక్కు సంఘములు, వారిని ఆహ్వానించెను. వారి ఆహ్వానములనందుకొని ఆదినమంతయు మోటారులో వివిధస్థలములకు వెళ్ళియుంటిమి. మా నాన్నగారు కార్మికసంఘములయొక్క స్వాగతపత్రముల నందుకొని, కొన్ని పరిశ్రమా లయములకు ప్రారంభోత్సవమును జరిపిరి. ఆయనను గౌరవించుటకై స్నేహితు లొసగినవిందులకు వెళ్ళియుంటిమి. వంగదేశములో నాతండ్రికిగలకీర్తికి నే నెంతయో గర్వించితిని.

ఆసాయంకాలమే మేము కాళీగంజికి ప్రయాణమైతిమి. మరునాడు సాయంకాలము కాళీగంజి చేరితిమి. స్టేషనువద్దకు పలువురు ప్రముఖులు వచ్చిరి. నాకు కానున్న భర్త ఎక్కడ వచ్చునో యని భయపడితిని. కాని ఒక పెద్ద మనుష్యుడు మానాన్నగారిని సమీపించి "బాబూసాహెబ్! కొన్నితొందరపనులవలన రాజాసాహేబ్ యిచ్చటకు రాలేకపోయెను. వారు తమ క్షమార్పణ మీకందజేయుమనిరి. రేపటిదినమున వారు మిమ్ము మీ భవనమునందే కలసికొనెదరు." అనెను.

శాస్త్రిజీకూడ స్టేషను వద్దకు వచ్చియుండెను. ఆం మునుపటికంటె వృద్ధుడయ్యెను. కాని స్వభసిద్ధమైన చిరున మాత్రము ఆయున వద్దనుండి పోలేదు. శాస్త్రిజీ నన్ను కు ప్రశ్నలు వైచెను "శశిరేఖా దేవి! నేడు నాకన్నుల పండువ చుండెను. నిన్నుజూచిన స్వర్గమలంకరించిన నీమాతృదేవ నాయెదుట ప్రత్యక్ష మగుచుండెను." అనెను మాకొరకై మూడు మోటారు లచ్చట సిద్ధముగయుండెను. అందొక పెద్ద మోటారులో మేమెక్కితిమి. మానాన్నగారు, వారి వకీలు ముందుస్థలములో కూర్చొని యుండిరి. వెనుకస్థలములో నేను శాస్త్రిజీ కూర్చుంటిమి. శాస్త్రిజీ నా వివాహమును గూర్చి ప్రసంగించెను. రాజా ప్రభుల్లచంద్రునిగూర్చి తానంతకు పూర్వము వ్రాసినది లెక్కచేయువద్దనెను. యోగులు చెప్పిన పలుకు లాలకించి తానట్లు వ్రాసియుంటిననెను. మేము మా భవనమును చేరితిమి. ద్వారము వద్ద మాపిన్ని గంగనునిలువ బడియుండిరి. వారు నాకప్పుడు జూపిన ప్రేమాదరణలుజూచి చాల ఆశ్చర్యపడితిని. మాపిన్ని నాసామానెల్ల మాఅమ్మ గదిలో పెట్టించెను. ఆగది ప్రవేశించినంతనే నాకు దుఃఖము పొంగి వచ్చెను.

తాను చెప్పినట్లు రాజా ప్రఫుల్లచంద్రుడు తనవకీలును వెంటబెట్టుకొని మాయింటికి వచ్చెను. మానాన్నగారు వారిని యుచితరీతిని మర్యాదచేసి కచేరిచావడిలోనికి దీసుకొని వెళ్ళిరి. చాలసేపటివరకు వారిద్దరూ మాట్లాడుకొనిరి. వారు వెళ్ళ

చున్నప్పుడు నేను మేడపైనుండి తొంగిచూచితిని. ప్రఫుల్ల చంద్రుని జూచినంతనే నామనస్సునందొక విధమైన యేవగింపు కలిగెను. తరువాత మానాన్నగారు నాగదిలోనికి వచ్చిరి. అప్పుడు వారు చాలసంతోషముతోనుండిరి. వారినట్టి స్థితిలో నేనెన్నడు జూచియుండలేదు. నాభుజముపై చేయివైచి, రెండవ చేతితో నాముంగురులు సవరించుచు, "శశీ! నీవుచాల ధన్యురాలవు. నీవు కాళీగంజికి జమీందారిణివి కాగలవు. రాణియను బిరుదునుగూడ నీవు బడయగలవు. నీమాట నతిక్రమించగల మానవుడు ఈపట్టణమందుండబోడు. వివాహమునకు ముహూర్తము నిశ్చయింప బడెను. పది దినములు మాత్రమే వ్యవధియుండెను." అని చెప్పి వెడలిపోయిరి. కాని నాకంతకంతకూ నిరుత్సాహము కలుగుచుండెను.

ఒకనాటిసాయంకాలమందు నేను బండిపై డాక్టరు సుశీల చంద్ర ఛటర్జీ గృహమున కరిగితిని. నారాకను విని ఆపుణ్య దంపతులు నాకెదురై అమందానందమును జెంది నన్నాదరించిరి. నళినరంజనుడు నన్ను కలసిన వార్తవిని, ఆతనిక్షేమ మరసి చాలసంతసించిరి. వారొసగిన అల్పాహారమును భుజించి తిరిగి మాభవనమునకు వచ్చుచుండ, శాస్త్రిజీ నన్ను జూచి బండిలో నెక్కెను. నళినరంజనుడు తనకు వ్రాసిన ఉత్తరమును శాస్త్రిజీ నాచేతికందిచ్చెను. అది చదివినంతనే నా ప్రాణములు ఎగిరిపోవుచున్నట్లయ్యెను. ప్రఫుల్ల చంద్రుడు త్రాగుబోతనియు, వేశ్యాలోలుడనియు, ఒకసినిమా తారతో

నాతనికిగల సంబంధమును గూర్చియు, వ్రాసి. ఎట్లయిన నా వివాహమును రద్దుగావింపజేసి నన్ను కాపాడుమని శాస్త్రిజీని కోరియుండెను. ఆడుత్తరమును శాస్త్రిజీకి యిచ్చివేసి రుమాలుతో నాకండ్లు దుడుచుకొనుచుంటిని. అప్పుడు శాస్త్రిజీ తన శాంతవచనములతో నన్నూరడించి, తాను నాతండ్రితో మాట్లాడి నిజానిజముల నారసెదనని నాకుజెప్పెను.

నావివాహమునకు తొందరగ సన్నాహమెల్ల జరుగుచుండెను. వివాహసరంజములకై నాతండ్రి ధనమును విరివిగ కర్చుబెట్టుచుండెను. గృహాలంకారములెల్ల పూర్తియగుచుండెను. మాపిన్ని గృహమందు పనివాండ్రపై కసరుచు విసుగుజెందుచూ చాలహడావిడి చేయుచుండెను. రేపటి దినమున వివాహము. ఆమె వెనువెంటనే నేను దిరుగుచుంటిని. ఆమె తన గదిలోనికి వెళ్ళినంతనే నేనును లోనికి బోతిని.

“ ఏమే శశీ! నీముఖమెందుల కట్లు వాడియుండెను? నీశరీరములో బాగుండలేదా? అట్లయినచో డాక్టరునకు కబురు బంపెదను. ఇంత ధనము వ్యయము గావించిన పిదప నీకస్వస్థతగ యుండిన చాల ఆబాసువచ్చును ” అని గుక్క దిప్పక బలికెను. ” కొంచెము జలుబు మాత్రము చేసియున్నది. మరేమియు భయములేదు ” అని నేను జవాబిచ్చితిని.

“ అట్లయిన నీవిచ్చుటికి వచ్చిన కారణమేమిద్ది? అని నా వంక తేరిపార జూచెను. నేను చెప్పినదంతయు ఆమె బాగుగ వినెను. పిదప ఒక్కనవ్వునవ్వి “ అట్లయిన ఆసంగతినీవు కూడ

వినియుంటివి, శశీ ! నీవు చాల అమాయకు రాలవు ” అనెను. అప్పుడది నిజము కాదాయని నేనామె నడిగితిని.

“ శశీ ! నీవు ప్రపంచానుభవము లేని బేలవు. ఆతడు చెడు నడతలు నడచిన నడుగాక ఇంక ముందట్లే నడచునని ఎవ్వరు చెప్పగలరు ? పాలపొంగు వంటి యువ్వనములో యువకులనేకములగు చెడుపనులు జేసెదరు. కాని వారే క్రమముగ బుద్ధిని కలిగి మంచిమార్గమును బట్టెదరు. దానికై నీవు విచారింపవలసిన పని లేదు. ”

“ కాని, పిన్నీ ! ఒక సినిమా తారతో నాతనికి సంబంధము కలదని కూడ వినియుంటిని. ఆమెనే తన భార్యవలె జూచుచున్నట్లు తెలిసెను. ”

“ కానిమ్మా ! దానికికొంతపైక మొసగినచో అది పోయిపరాకనితో స్నేహము జేయును. అయినను నీభర్తయందు నీవు అణకువతో యుండవలసినదే కాని, ఆతని చర్యల నేకరు బెట్టుట నీ పనిగాదు. నీవే అదృష్టవంతు రాలవైన నీవాతని యనురాగమును సంపాదించగలవు. ”

“ పిన్నీ ! వివాహమునకు ముందు వధూవరుల మధ్య ప్రేమయనునది ముఖ్యముకాదా ? ”

“ ఓసీ పిచ్చిదానా ! ప్రేమ యనిన యిప్పుడు నీకేమి తెలియును ? వివాహమైన పిదప ప్రేమ అంకురించును. అప్పుడే మీకు ప్రేమబంధ మేర్పడును. గనుక నీవు నన్నింక వేపించక పోమ్మా ”

అని బలికి మాపిన్ని తన గదిని విడిచిపోయెను. నేను నాగదిలోనికి వెళ్ళునరికి, శాస్త్రిజీ స్వహస్తముతో ఒక ఉత్తరము నాకంటబడెను. అందు నాతండ్రితో తాను చాల సంగతులు ముచ్చటించినట్లును, నళినరంజనుడు ప్రఫుల్లచంద్రుని గూర్చి వ్రాసిన సంగతులు యదార్థము కాదని ఋజువు చేసినట్లును—గనుక ఆసంగతులెల్ల నాతలంపునుండి పీకుమనియు వ్రాసియుండెను. కాని శాస్త్రిజీ చెప్పినట్లు నేను చేయజాలక పోతిని. నళినరంజనుడు చెప్పినదే యదార్థమని, ఎందువలననో గాని నాఅంతరాత్మ బలుకుచుండెను. ఇట్టి విచారపూరితమగు యోచనామనస్కనై ఆదిన మంతయు గడపితిని. ఆ రాత్రి భోజనమైన వెనుక నాకొక ఉపాయము తట్టెను. నాకు ఎన్నడును లేని ధైర్యము కలిగెను. నేను మేడ దిగి మా నాన్నగారి గదిలోనికి వెళ్ళితిని. వారప్పు డెద్దియో వ్రాసుకొనుచుండిరి. నన్ను జూడగనే వ్రాయుట మాని నేను కూర్చొనుటకు ఒక కుర్చీని తన సమీపమునకు దీసిరి. "శశీ! నీవింకనూ బరుండక ఎందుల కిచ్చటకు వచ్చితివి?" అని ప్రశ్నించెను. నేనప్పుడు నామనోవిచారము వారికి దెలిపి "నాకిట్టి వివాహము జేయుట మీకు ధర్మమా?" యని పలికితిని.

కాని నా ఉద్దేశమును గ్రహింపకయే నాతండ్రి పెద్ద నవ్వు నవ్వెను. ఆనవ్వు నన్ను భీతిగొలిపెను. నేను కొంచెము తడబడుచూ "నాన్నగారూ! నేను రాజా ప్రఫుల్ల చంద్రుని ప్రేమింపలేను. గనుక నాశ్రేయస్సునిగోరి ఈవివాహమును ప్రస్తుతము రద్దుచేయుడు." అని దీనముగ కోరితిని.

“ఏమీ! ఇప్పుడు రద్దుచేయుటయా? వ్రాతమూలకముగ యేర్పాటు లెల్ల జరిగి చాల ధనము నేను వ్యయము జేసిన పిమ్మట వివాహము. రద్దు బరచుటయా?” అని నా తండ్రి గర్జించెను.

“నాపై ననుగ్రహ ముంచి యట్లు చేయుడు. ఏమన... ..........” నామాట పూర్తిగాక ముందే, నాతండ్రి తన చేతిలోని కలమును బల్లపైనుంచి, క్రోధపూరితమయిన దృష్టిని నాపై బరపి, శశీ! నీకు మతి చలించినదా? లేనిచో ఎవ్వరైన నిన్ను చెడదీయుటకు నీకిట్లు నేర్పియుండిరా? ఈ వంగదేశమం దెవ్వరును చేయలేని సంబంధమును, ధనవ్యయమునకు వెనుదీయక నీకు చేయుచుంటిని. తరతరములనుండియు దేశఖ్యాతిని గాంచిన ముఖర్జీ కుటుంబమునకు నీవు కోడలు వగుట నీపూర్వపుణ్యసుకృతముగ నెంచుము. దానంజేసి నీ పుట్టినింటికి గూడ పేరుప్రతిష్ఠలు తేగలవు. నేనింత దూరమాలోచించి సర్వయత్నములు జేసియుండ ప్రస్తుతము రద్దు జేయుమని బలుకుచుంటివి—అది పూర్తిగ రద్దు చేయుమనియా నీకోరిక? నీవు నన్నీసమయమందు ప్రపంచదృష్టిలో మూర్ఖుని జేయువలెనని తలంచుచుంటివా?” అని గద్దించెను.

నాయుద్దేశ్యమది కాదని నేను జెప్పుచుండ, నానోరును మెదలనీయక నాతండ్రి కోపోద్రేకములతో “ఆ తుంటరి వారికందరికిని ఉత్తరములు వ్రాసెను. నాకు—శాస్త్రిజీకి—నావకీలునకు కూడ వ్రాసెను. నీకు వివాహ మాడుట యిష్టము

లేనిచో లేదని నాకు జెప్పుము." అని రౌద్రాకారుడయ్యెను. అంతటితో యూరకుండక "నీ శ్రేయస్సునకై నేనంత యోచన లేనివాడనని తలంచుచుంటివా ? నీపినతల్లి తన కుమార్తెకు, ఈ సంబంధము చేయుమని ఎంత ప్రాధేయపడినను నేను పెడచెవిని బెట్టి, నాకన్న కుమార్తెవగు నీకై ఈప్రయత్నమును జేసితిని." అనెను. నేను చాలభీతిల్లితిని. నానోట మాటయే రాలేదు. అది గ్రహించి నాతండ్రి కొంత శాంతమును చేబట్టి నన్నుతన సమీపమునకు దీసుకొని, "శశీ! నీమంకుతనమును వీడుము. నీవు వట్టిబేలవు. ఆ భారతమంతయు నాపైయుండ నీవిట్లు యోచింపవలసినపని లేదు. నీవు సంతోషస్వాంతవైయుండుము చాల రాత్రి యయ్యెను. నీవు పోయి పరుండుము." అని. నన్ను మంచిమాటలతో బంపివేసెను.

*　　　*　　　*　　　*　　　*

ఆ మరునాడు మా గృహము బంధుమిత్రులతో కళకళలాడుచుండెను. రాజా ప్రఫుల్లచంద్రుడు తన పరివారముతోడను, బంధువర్గముతోడను తరలివచ్చెను. పేరంటాండ్రు వధూవరులకు మంగళస్నానములు జేయించి, చక్కగ నలంకరించి వివాహమంటపములో గూర్చుండబెట్టిరి. యథావిధిని వివాహము జరిగెను. కాని నేను ముఖమెత్తి వరునిగాని, బంధుజనులనుగాని, మరెవ్వరినిగాని జూడలేదు. బ్రాహ్మణులతో నాతండ్రి విరివిగ సంభాషణలు బహుమతులొసగెను.

వేలకొలది జనుల కాదినము విందు గావింపబడెను. ఆ రాత్రి మహావైభవముతో వధూవరుల నూరేగించిరి. అంతటి వైభవము నాపురజను లెన్నడూ కవివిని యుండ లేదు.

ఊరేగింపు అయిన వెనుక, నేనునాగదిలోనికి బోయి పరుండుటకు ముందు నాఅలంకారములతో ఒక్కసారి నిలువుటద్దము నెదుటకువచ్చి నిలదితిని. నాముఖము కళావిహీనమై యుండెను.

వివాహమైన మరుచటి దినమున వధువుతో వరుడు తన గృహమునకు వెళ్ళుట కాళీగంజ జమీందారుల కుటుంబమునకు చిరక్రమమై యుండెను. ఆక్రమము ననుసరించి నన్నా సాయంకాలము వారి భవనమునకు బంపుటకు నిశ్చయించిరి. ఆ మూడవ దినమున నాభర్తతో నేను కలకత్తా వెళ్ళవలసి యుండెను.

నాభర్తయొక్క సౌధము కాళీగంజికి ఆరుమైళ్ళదూరములో నుండెను. దానికి "రమాభవనము" అనిపేరు. మేము చ్చుటకు వెళ్ళుటకు మోటారులు వచ్చియుండెను. నాభర్త ముందు నడచుచుండెను. తరువాత నాతండ్రి ఆయనవకీలు వెళ్ళుచుండిరి. వారివెనుక నన్ను మాపిన్ని చేయిబట్టుకొని కారువద్దకు దీసుకొని వెళ్లుచుండెను. మావెనుక శాస్త్రిజీగంగ మొదలైన వారు పెక్కుమంది కలరు. ముందుగ రెండుమూడు మోటారులలో మాసామానంతయు వెళ్ళుచుండెను. మాకై అలంకరింపబడియున్న మోటారులోనికి వెళ్ళి నాభర్తకూర్చొ

నేను. నాకు దుఃఖమువచ్చెను. మాపిన్ని గంగ యేడ్చుచుం డిరి. జాలిగొలుపు వదనముతో శాస్త్రిజీ నావంక జూచుచుం డెను. శాస్త్రిజీ పాదములకు నేను నమస్కరించితిని. పిమ్మట మానాన్నగారికిని, మాపిన్నికిని, మరికొందరి పెద్దలకు నమస్క రించితిని. గంగ నన్ను కౌగలించుకొనెను. మాపిన్నిగారునన్ను దీసుకొనివెళ్ళి మోటారులో నాభర్తప్రక్కన కూర్చొండ బెట్టి తలుపు మూసెను. మోటారు కదిలెను.

*  *  *  *  *

మోటారు వేగముగ బోవుచుండెను. మోటారు డ్రైవరునకును మాకును మధ్య ఒకతెర కట్టుబడియుండెను. పురము దాటిన పిమ్మట నాభర్త చిరునవ్వు నవ్వుచు నావైపు నకు జూచి,

"మనమిప్పుడు దంపతులమైతిమి కదా !" అనెను.

నేను జవాబొసంగలేదు. నావైపటు లేచూచుచు,—

"మనమిప్పుడే సంసారసాగరము నీదవలయును గదా?

దానికిని నేను జవాబొసగలేదు. అటుపైనాతడు నా రూపురేఖలను వర్ణింపదొడగెను.

"ప్రియా ! నీసుందరాకారమును చూచి ప్రేమముగ్ధుడ నగుచుంటిని. ఇది యదార్థము" నాకా పలుకులు అసహ్య తను గలిగించెను. నాముఖమును వేరొప్రక్కకు ద్రిప్పు కొంటిని.

"ప్రేయసీ! చంద్రబింబమువంటి నీ మోమునట్లు త్రిప్పు కొనవలదు. నీ విశాలనేత్రములను చూచి యానందించనిమ్ము" అని బలుకుచు, ఆతడు నా సమీపమునకు జరిగెను. నాకు భయము పుట్టి యాతనిని దూరముగ త్రోచితిని.

"ఇది యేమి?" అని యాశ్చర్యము జెందునట్లు నాభర్త పలికెను. తిరిగి యాతడు నా నడుముపై తన చేయిజాచి తన సమీపమునకు నన్ను దీసుకొనుటకై ప్రయత్నించెను. నేను బలముగ మరొక్క త్రోపుద్రోచి ప్రక్కకు జరిగితిని.

అతని ముఖము నల్లబడెను. కాని మరలనవ్వుచు నన్ను ముద్దిడుకొనుటకు ప్రయత్నించెను. నా ముఖమును వెనుకకు త్రిప్పుకొంటిని. అప్పుడాతడు కానిమ్ము మరికొంతసేపు పోనిమ్ము అని కండ్లెర్రజేసుకొని యూరకుండెను. నామానమును కాపాడుకొనుటకు శక్తినిమ్మని దైవమును ప్రార్థించితిని. నేను అనుభవింపనున్న కష్టములు నాకుస్ఫురించుచుండెను.

మోటారు రమాభవన మెదుట నిలిచెను. రమాభవనము చాలాపురాతనమైనది. కాని అదిచాల విశాలముగను అందముగను కట్టబడియుండెను, నిర్మాతయొక్క నైపుణ్యమును దెలియజేయుచుండెను. సరియైన బాగుచేతలులేక కొంత భాగము పాడుబడియుండెను. ఆభవనము విద్యుద్దీపములతో ఆదినము చక్కగ అలంకరింపబడి యుండెను. ఆ భవనమును ప్రవేశించినంతనే అవమానముతో కూడుకొనియున్న భయము నన్నావేశించుచుండెను. అది సహజముగను స్త్రీ తన భర్తతో

ప్రథమ దినమున యేకాంతముగ యుండునప్పుడు కలిగెడిభయ మువంటిదికాదు. మేడపై దక్షిణభాగమందు రెండు పడకగదులు. వాటికిమధ్య ఒకచావడి కలదు. అందుకూర్చొనుటకు కుర్చీలు, సోపాలు, పెద్దమేజా కొన్ని నిలువుచిత్తరువులుకలవు. చావడి కుడివైపునున్న పడకగదియందు ఒకచక్కటి పందిరిమంచము ఒకసోపా, రెండుకుర్చీలు. అద్దము అమర్చబడియున్న మేజా, ఒకపెద్దబీరువా, రెండు నిలువుటద్దములు, కొన్నిచిత్తరువులు కలవు. రెండవగదియందు ఒక యినుపమంచము మాత్రము యుండెను. బహుశా అది యజమానురాలియొక్క దాసికై యుండును. ఆ భవనమునందలి ఉపకరణములన్నియు పురాతనమైనవే. నన్ను చావడిలోనికి దీసుకొనివచ్చి, కలకత్తాకు కొన్ని తంతివార్తలు బంపుటకై నాభర్త క్రిందికివెళ్ళెను కొంతసేపటిలో నాభర్త మేడపైకివచ్చి, నన్నుక్రింది భోజన చావడి లోనికి దీసుకొనిపోయెను. భోజనసమయమందు మేమేమియు మాట్లాడుకొనలేదు. భోజనమైన పిమ్మట నేనుముందుగ పైచావడిలోనికి వచ్చి, ఒకకుర్చీలో కూర్చొనియుంటిని. కొంతసేపైనపిమ్మట నాభర్తవచ్చి, నాకుర్చీవెనుక నిలువబడెను. తన ముఖమును నావైపునకుబెట్టి, చిరునవ్వునవ్వుచు నాపెదవులపై ముద్దుపెట్టుకొనెను. ఆ ముద్దునాకెట్టి అసహ్యత అశుచికలిగించెనో మీకుదెలుపుట చాలాకష్టము. అతడప్పుడు సురాపానము గావించియుండెను నేను నా రెండుచేతులు నాతని మోముపైనిడి ఒక్కత్రోపు త్రోసితిని.

"ప్రియా ! నీకిది భావ్యమా ? కాదు. నీవు స్మృతిమించు చుంటివి. మోటారులో నీకిష్టము లేకపోయిన, అది వేరుసంగతి కాని యిప్పుడో ! మనము మన సౌధములో నుంటిమి. అని జెప్పి పకపక నవ్వుచుండెను. నాశరీరము వణకుచుండెను. నానోటతడియారుచుండెను నేను లేచి వేరొకకుర్చీపై గూర్చుంటిని. అతని మోముపై నాచూపుబడెను. ఆతడు వేశ్యాలోలుడనియు, త్రాగుబోతనియు, నేను దెలిసికొంటిని. నాభర్త తిరిగి నాయొద్దకు వచ్చి, నన్ను కౌగలించుకొనబోయెను. నాశరీరము కంపించెను. నేను చటాలున లేచి, పడకగదిలోనికి బోయి ద్వారమును బంధించితిని. నాభర్త ద్వారమువద్దకొచ్చి, తలుపు తెరువుమనెను. నేను తెరువలేదు. తలుపుపై బలముగ గ్రుద్దుచుండెను, నేను దానికి లక్ష్యపెట్టలేదు. "శశిరేఖా ! నీయుద్దేశ మేమిదో నాకు దెలియుటలేదు. నీవు నాకు భార్యవైతివి. నీవు నాకు బద్ధురాలవై ప్రవర్తింపవలయును. నీవు నన్ను వివాహ మాడినదెందులకు ? వివాహమందలి కట్టుబాట్లు నీకు తెలియువా ? గృహస్థాశ్రమధర్మములు నీకు నీగురుదేవి బోధింపలేదా ? హిందూమహిళావిద్యాలయము నిన్నింత జేలగ యొనర్చెనా ? నీతండ్రి-నీపినతల్లియైన నీకుబోధింపలేదా ? నామాటవినుము, నాసేవకులు, నాబంధుమిత్రులు వినిన యేమనుకొనెదరో కొంచము యోచింపుము. తుదకు ఈపట్టణమంత యుక్రోడైపోయి కూయును, అప్పుడు మనము నగుబాట్లకు లోనయ్యెదము." అని నాభర్త పలికెను.

నేను తలుపు తెరువలేదు. ఒక కుర్చీలో కూలబడితిని. నామనస్సు పరిపరి విధముల బోవుచుండెను. నేనెంత ప్రయత్నించినను, నామనస్సు యాతనిపై లగ్నమగుట లేదు. న భర్తపై అణుమాత్రమైన ప్రేమయనునది నాలో అంకురించుట లేదు.

కొంతతడవాగి, నాభర్త "శశిరేఖా! నీవు త్వరగ తలుపు తెరువుము. రేపుదయమే మనము కలకత్తా వెళ్ళవలసి యుండెను. వేకువజామున నే లేచి చాల సన్నాహము చేసుకొనవలసియుండెను." అనెను. ఆమాట వినినతోడనే నాకుముచ్చెమటలు బోసెను. కలకత్తా ఆతనితో వెళ్ళిన, నాగతియేమిగాను? అచ్చట నా మొర నాలకించువ దెవరు? ఏమైననుసరే, కలకత్తా రేపటిదినము వెళ్ళకూడదని నిశ్చయించుకొంటిని. అప్పుడు నాభర్తతో "నేను మీ వెంట కలకత్తా వచ్చునది లేదు. మీసన్నాహ మెద్దియో జేసుకొనుడు. నాకై నిరీక్షింపవలదు" అని చెప్పియుంటిని.

ఆ పలుకులు వినినంతనే నాభర్తకు కోపమధికమయ్యెను. కాని చేయున దేమియు లేక, అతడు చావడిలో నిటునటుదిరుగుచుండెను. తిట్టుకొనుచుండెను. తనకడ్డు వచ్చుచున్న వస్తువుల నన్నిటిని తన్ని బ్రద్దలుకొట్టుచుండెను. కొంతసేపైన పిమ్మట మరల ద్వారంవద్దకు వచ్చి,

"నీవు అక్కడ యుంటివా?" అనెను.

నేను దానికి జవాబు చెప్పలేదు. మరల బిగ్గరగన 'తలుపు తెరువుము."

నేను కదలకయే సోఫాలో కూర్చొని యుంటిని.

“ శశిరేఖా ! నీవు భయపడవలదు. నేను నిన్నేమియు చేయను. నీతో ఒక సంగతిమాత్రము చెప్పవలసి యున్నది.” అని నాభర్త యనెను. కాని నేనేమియు బలుకలేదు.

“ నీవట్టి మొండితనము వహించినచో నేనొక పని చేయవలసి యున్నది. వినుచుంటివా ?”

“ వినుచుంటిని.” అని నేను జవాబిచ్చితిని.

“ నేను నీతండ్రికొక యుత్తరము వ్రాసి, నావకీలును మోటారులో బంపుచుంటిని.” అని నాభర్త యనెను.

“ అట్లేచేయుడు ”

“ నీవు బాగుగ యోచించుకొనుము. నీతండ్రి సంగతి నీకు బాగుగ దెలియును. నీమూర్ఖత కాతడు ఓరిమి వహించువాడు కాడు.”

“ కానిండు ” అని నేను ఖండితముగ చెప్పితిని.

ఆమాట వినినంతనే నాభర్త ఆ చావడిని విడిచి పోయెను. కొంతసేపైనపిమ్మట మోటారు ఆభవనమును విడిచి వెళ్ళుచున్నట్లు చప్పుడు వినబడెను.

## అధ్యాయం ౬

నేను కిటికీ యొద్దకు వచ్చి నిలువబడి యుంటిని. అప్పుడే శశాంకు డుదయించుచుండెను. నిర్మానుష్యముగానున్న సౌధము వెలుపటి ప్రకృతి సౌందర్యమును ఆ నీలి కాంతిలో జూచుచుంటిని. అట్లు నేను చాలా సేపు యుంటిని. నాకు నిద్దుర వచ్చుచుండెను. దీపమును తగ్గించి సోఫాపై మేనువాల్చితిని కొద్ది కునుకు బట్టుచుండెను. అంతలో మాపిన్ని వచ్చి, —

"శశీ! శశీ!! అని బిలుచుచు వేగముగ తలుపు దట్టెను. నేను తొందరగ లేచి తలుపు తెరిచితని. మాపిన్ని గదిలోనికి ప్రవేసించి,

"ఓసీ! వెర్రిపిల్లా!! ఈఅల్లరంతయు ఎందులకో నాకు కొంత జెప్పుము" అని ప్రక్కనే కూర్చొని. మాపిన్ని పక పక నవ్వెను. ఆమె అట్లు నవ్వుట నే నెన్నడును జూడ లేదు.

"రాజా ప్రపుల్ల చంద్రుని లేఖ, మేము పరుండు సమయమున చేరి, మమ్ములను భయపెట్టెను. నీతండ్రి స్వయముగా రావలెననుకొనెను. కాని అది ఆడువారి పనియని వాదించి, నేనే యిచ్చుటకు వచ్చితిని. గనుక నీభయమెందులకో నాకు తెలియజెప్పుము. వివాహమనిన యెట్టిదో గృహస్థా శ్రమ

ధర్మము లెట్టివో దెలియని నీకు, వాటిని దెలుపకయే వివాహ మొనర్చినందులకు నన్నూ, నీతండ్రిని ఎత్తిపొడుచుచు నీభర్త ఉత్తరము వ్రాసియుండెను. మరియు నీవాతనితో కలకత్తా వెళ్ళుటకు నిరాకరించితివట—కాని నీ కాసంగతులు తెలియ వని మేమెట్లు యనుకొనెదము ? శశీ! నీవలన నాకుచాలా అవ మానము జనించినది. ఓసీ! మద్దుమృగమా, ఈప్రపంచ మెట్లు నడుచుచుండెనో నీకు తెలియుదా ? మానవోత్పత్తిని గూర్చి నీగురుదేవి నీకుబోధించలేదా ? పదిసంవత్సరములు నిన్ను తనయొద్దపెట్టుకొని గరిపిన విద్యయొక్క సారాంశ మిది యా ? అనుచు తిరిగి వవ్వనారంభించెను. నాకదిచాల ఎగతా ళిగదోచెను. ఆమె నాఅంతరోద్దేశమును గ్రహింపలేక పోయె నని విచారించితిని. నేనువేరు ప్రత్యుత్తర మొసంగకుండుట జూచి,

"నీభర్తయే నీకుదైవము. అతడే నీప్రాణరక్షకుడు అతని తోడిదే నీకు లోకము. నీ రక్తమాంసము లాతని కర్పిం పబడెను గనుక నీకాతడే యధిపతి మనోహరుడు—ప్రాణ ప్రియుడు" అని మాపిన్ని బలుకుచుండ నాముఖమెఱ్ఱబడెను. నాకు దుఃఖము పొంగి వచ్చుచుండెను. మాపిన్ని నాపైజాలి గొనక, "రమ్మా దీనికంతకు నీభయమే కారణమని నాకుదెలి యును. నీవలెనే నాకును భయముండెడిది. కాని అదికొద్దిదిన ములు మాత్రమే—గనుక నీవుకొద్దిదినములలో అన్నిటికిని యలవడెదవు. ఇప్పటికైన నీ మూర్ఖతను విడువుము. లేదేని

నీభ ర్త యలిగి నీ జీవితమునకు మట్టు బెట్టును, గనుక నామాట విని ఆతనితో సఖ్యతగా నుండుము లేదేని రేపుపుదయమాత నితో కలకత్తా వెళ్ళుటకు సిద్ధముగ యుండుము.

అని నన్నొత్తిడి జేసెను.

"! నేనట్లు చేయలేను"

"ఏమీూ, నీవట్లు చేయలేవా?"

"చేయలేను." అని నేను ఖండితముగ బలికితిని. మూ పిన్ని నన్ను తూలనాడుచు, నాపై ఒక్క వర్షమును గురిపించెను. నేను నాభర్తతో వెళ్ళనిచో నాతండ్రి గృహమందు నాకు తావులేకుండ జేసెదనని శపథము పట్టి ఆగది విడిచి పోయెను.

. ఒక అరగంట తరువాత నేను చావడిలోనికి వెళ్ళి ఒక కుర్చీలో కూర్చొని యుంటిని. అంతలో నాతండ్రి వకీలువచ్చి, నాకు సమీపముననే వేరొక కుర్చీలో కూర్చొని, దయారసముతో నావైపు జూచి చిరునవ్వు నవ్వెను. పిమ్మట తన పొడుగాటి గడ్డమును తన వేళ్ళతో సవరించుకొని, శాంతవచనములతో నాకు బోధించెను. నాపట్టు వీడనిచో హిందూశాసన ప్రకారము నేను చాలాఅవస్థలకు లోనయ్యెదనని తెలిపెను. తరువాత నాతండ్రి నావివాహమునకై చాలా ద్రవ్యమును వెచ్చించెనని జెప్పెను. మూడులక్షల రూపాయలిచ్చి, నాభర్త ఋణములందీర్చెను. సంవత్సరమునకు ఏబది వేల రూపాయలు అల్లునకిచ్చెదనని వ్రాతపూర్వకముగ వాగ్దత్తము జేసెను. అది

వినినంతనే నాహృదయము బ్రద్దలగు నట్లయ్యెను. నానోట-మాటయే రాలేదు. అప్పుడు వకీలు నాచేయిబట్టుకొని, చిన్న బిడ్డకు చెప్పురీతిని, "శశిరేఖా! నామాటవినుము నీతండ్రిని నష్టపెట్టి, యాతని మనస్సునకు కష్టము కలిగించకుము. నీవు నీ సౌఖ్యమునకు మారకముగానలయకు. నీభర్తతో నీవు కలిసి యుండుము. ఆతని వెంట రేపు కలకత్తా వెళ్ళుటకు నంగీకరింపుము." అనెను.

అప్పుడు నేను కన్నులు తుడుచుకొని "వకీలు బాబూ! నన్ను క్షమింపుము. ఆయనను యొంటరిగనే కలకత్తా వెళ్ళనిండు" అనిబలికితిని. ఆమాటకు వకీలు వేరుబలుకలేక, ఆస్థలము విడిచి క్రిందికి వెళ్ళిపోయెను. నేను గదిలోనికి వెళ్ళి సోఫాలో కూలబడితిని. నాతల చాలా భారముగయుండెను. గడియారము పన్నెండు గంటలు కొట్టెను. అంతలో తలుపు మరల చప్పుడయ్యెను. శాస్త్రిజీ వచ్చి నాసోఫాకు దగ్గరగా కుర్చీపై గూర్చొనెను. నేనాతని చేయిబట్టుకొని నాముఖము నందిముకొని, ఏడ్చితిని. శాస్త్రిజీ హృదయము చాలపరితపించెను. రెండవ చేతితో నాతలనిమురుచు, "అమ్మా! నీవు యూరడిల్లుము. పరిస్థితులెల్ల చక్కబడగలవు." అనెను. నేను యదార్థముగ జరిగినసంగతులెల్ల శాస్త్రిజీకి తెలిపితిని. శాస్త్రిజీ నాఅంతరంగికములెల్ల గ్రహించెను.

"అమ్మా! యదార్థము నంతయు నేను గ్రహించితి. ప్రేమశూన్యమైన వివాహామే ఈసంఘటనకు కారణము. సం

గతులు కొన్ని తెలిసినమీదట ఈవివాహమును రద్దుగావింప యత్నముచేయనందున నేనుకూడ నిందాస్పదనే—కాని తల్లీ! అదంతయు గతించెను."

శాస్త్రీజి! ఇప్పటికైనను వివాహము రద్దుగావించుటకు వీలులేదా ?"

అమ్మా! అదెట్లు పొసగును. అగ్నిసాక్షిగ నీవాతనిని వివాహమాడితివి. అదియే ప్రపంచము లక్ష్యపెట్టును. ఇప్పుడు జరిగిన హాంశములకు శాస్త్రశాసన దృష్టుల రెంటికిని నీవే నిందాస్పదురాల వగుదువు"

"అట్లయిన శాస్త్రీజీ, నేను లోబడవలసినదేనా ?"

"తల్లీ! నీవు నీభర్తకు విధేయురాలవై ప్రవర్తింపవలెను. అప్పుడే నిన్ను ప్రపంచము హర్షించును."

"శాస్త్రీజీ! నేను నాభర్తతో కలకత్తా వెళ్ళక తప్పదా ?"

"బిడ్డా నీవు వెళ్ళకతప్పదు. నిన్ను యొప్పించుటకై నీతండ్రి మీనిన్ని మొదలగువారు నన్ను బంపియుండిరి. నీవట్లు చేయనిచో నీవు ముందు చాలా కష్టములకు లోనయ్యెదవు."

"అట్లయిన శాస్త్రీజీ, నాదొక కోరిక కలదు."

"అది యేమి ? తల్లీ ?"

అది చెప్పుటకు నాకు చాల కష్టముగ తోచెను. అయినను ప్రయత్నపూర్వకముగ వద్దానిని వచించితిని.

"నాకు వాగ్దత్తమివ్వవలెను. నేను రేపు నాభర్తతో

కలకత్తా వెళ్ళి, అతనిని వెంట వంటియుండెదను. ఆతనిని కుటుంబనామమును బిరుదులను నేను గ్రహించెదను. దాని వలన మాలో గుట్టులు ఇతరు లెరుగజాలరు. కాని నేనాతనిని ప్రేమించువరకు నన్ను తన భార్యగ నెంచరాదు."

ఆమాటలకు శాస్త్రిజీ తలనూపి, చిరునవ్వుతో

"అట్లు చేయవలెనా ?"

"అవును."

"సరే నేనాతనిని యొప్పించెదను. కాని నీవాతనిని ప్రేమించుటకు ప్రయత్నించవలెను. నీకు శుభమగుగాక" అని నన్ను దీవించి శాస్త్రిజీ క్రిందికి వెళ్ళెను.

* * * * *

మేము కలకత్తా చేరిన వెనుక ఒక గొప్ప హూటలులో బస జేసితిమి నాభర్తను ప్రేమించుటకు నేనెంతయో ప్రయత్నించుచుంటిని. కాని ఆ ప్రయత్నములెల్ల వ్యర్థమగుచుండెను.

మేము కలకత్తా చేరిన మరుచటిదినమే చాలామంది నాభర్తను జూచుటకు వచ్చియుండిరి. వారిని జూచి నాభర్తకు ఆ పట్టణమందు చాలా ప్రాబల్యము గలదని తలంచితిని. కాని వారందరు ఋణదాతలని నాకు క్రమముగ దెలియవచ్చెను. వారితో చాల తగవులుపడి, నావివాహమువలన వచ్చిన పైకముతో వారి ఋణములు దీర్చెను. ఇదివరలో తాను

వివాహమాడవలెననుకొనిన సినిమా తారకు పదివేల రూపాయి లొసగి, తాను ఆమెకు వ్రాసిన యుత్తరముల నన్నిటిని కొనెను.

నాభర్తయొద్దకు తరచు స్నేహితులు వచ్చుచుండెడి వారు. వారితో కలసి నాభర్త త్రాగి, చాల అల్లరి చేయు చుండెను. రోజులు గడచినకొలది నాభర్తకును నాకును మధ్య ఎడము హెచ్చుగుచుండెను. బహుశా నేనన్నిద్రమైన చక్రవర్తి ప్రసంగముతో నాతనిని సంతసింపజేసిన మాపరిస్థితులు చక్క బడితవేమో ? కాని నా ప్రసంగ మాతనికి విసుగు గలిగించు చుండెడిది. మా అభిరుచులు అభిప్రాయాలుగూడ వేరుగ యుండెడివి. నిరాడంబరమైన గ్రామజీవితము నాకిష్టము. పట్టణమందుండి, నూతన ఆడంబరములతో మెరుగుట నాభర్త కిష్టము. కన్నులకు మిరుమిట్లు గొలుపు విద్యుత్కాంతిలో రాత్రులందు కాలము వెలిబుచ్చుటనాభర్తకు సంతసమును చేకూ ర్చును. సంధ్యాసమయములు చంద్రకాంతి నాకాహ్లాద మొసగ వును. ఆతని మనస్సుచాల అల్పమైనదనియు, నీచమైనదనియు నాహృదయములో నాటెను. కాని ఆయుద్దేశములను నాలో నుండి దూరము గావించుకొనుటకు నేనుచాలా ప్రయత్నించి తిని. అయిననేమి ? అది దుర్లభము.

ఆ వేసవికి సిమ్లాలో యుండవలెనని నాభర్త నాకెరిం గించెను. నేనందుల కంగీకరించితిని. అంతకు ముందుగనే నా తండ్రివద్దనుండి నాకొక యుత్తరము వచ్చెను. ఇంపీరియల్

బ్యాంకునందలి తన మొత్తములోనుండి నాకు వలసినంత పైకమును రాబట్టుకొని ఖర్చుపెట్టుకొనుటకు నాకధికార మొసగుచు బ్యాంకు రసీదు పుస్తకమును నాకు బంపెను.

మేము ఆగ్రా, ఢిల్లీ మొదలగు పట్టణములను జూచి సీమ్లా పోవుచుంటిమి. మేము కూర్చొనియున్న మొదటితరగతి రైలుపెట్టిలోనికి ఒక పొడవైన యువతి ఎక్కెను. ఆమె సహజముగ రూపసి. దానికితోడు; ఆమె ధరించిన దుస్తులు, అలంకారములు చాల అందముగను దెచ్చెను. ఆమె నన్ను జూచిన తోడనే నాసమీపమునకు వచ్చి. "మీపేరు శశిరేఖా దేవి యేనా ?" అనెను. ఆమె కంఠనిధ్వనిబట్టి, ఆమె నాబాల్య స్నేహితురాలగు లలితయని దెలుసుకొంటిని. లలిత కిప్పుడు ఇరువదియేడు వత్సరములు. ఆమెనుదుటిపై జారి పడుచున్న ముంగురులు, పొడగైన తల వెండ్రుకలు, తీర్చిన కనుబొమలు, విశాల నేత్రములు జూచి ముగ్ధులుగాని వారుండరు. లలితను జూచి నంతనే నాకొక విధమైన ఆనందము కలిగెను. కాశీ విద్యాలయమందు మాచిన్ననాటి యాటపాటలెల్ల తలంపునకు వచ్చెను. లలిత నాక్షేమమారసిన పిమ్మట, నేనుచాల అదృష్ట వంతురాలననియు, నాభర్తరూపసియనియు, అట్టికుటుంబమున బడుట నాపూర్వజన్మ సుకృతమనియు, పొగడెను. తరువాత లలిత తనయుదంతముకూడ నాకుదెలిపెను. లలితనొక సామాన్య గృహస్తునకిచ్చి. యామెతండ్రి వివాహ మొనరించెను.

కాని వివాహమైన సంవత్సరములోనే భర్త చనిపోయెను. తరువాత ఆమె తన తలిదండ్రులవద్దనే అల్మోరాలో యుండెను. కొద్దిమాసముల క్రితమే తండ్రికూడ గోల్పోయెను. ఇప్పుడామె ఆరోగ్యము బాగు లేనందున సిమ్లాలో కొన్నిదినము లుండుటకు వెళ్ళుచుండెను.

వేరొక మెత్తపైకూర్చుని, ఎద్దియో పుస్తకమును చదుకొనుచుండిన నాభర్త ఇదంతయు వినుచునే యుండెను. కొంత సేపైన పిమ్మట ఆతడు నాయొద్దకు వచ్చెను. నాభర్తకు లలితను పరిచయము మొనర్చితిని వారు ఒకరినొకరు నమస్కరించుకొని, వివిధ సంగతులు ముచ్చటించుకొనిరి.

లలిత మావెంటనే సిమ్లాలో ఒక హోటలునందు బస చేసెను. ఆమె తరుచు మాయొద్దకు వచ్చి కూర్చొనుచుండెడిది. మావెంట షికారునకువచ్చుచుండెడిది. నాభర్తతో చాల చనువుగ మాట్లాడుచుండెడిది. క్రమముగ వారు యేకాంతమున ఇచ్చకము లాడుచుండిరి. నేను రాకపోయినను, నాభర్తవెంట లలిత సినిమాలకు నాటకములకు వెళ్ళుచుండెడిది. నాభర్తవెంట క్లబ్బునకుగూడ వెళ్ళుచుండెడిది. ఇట్లు కొన్నిదినములు గడిచెను. లలితయొక్క ప్రవర్తన నామనస్సునకు చాల కష్టమును కలిగించెను. ఆమె కపటదయ నాపై జూప మొదలిడెను. నాభర్తకును ఆమెకును జరుగుచున్న వ్యాపారమును గ్రహింపగలిగితిని. ఇప్పుడు నేను నాభ రము

ప్రేమించుటకు మారు, నాభర్తయే నన్ను ప్రేమించుటకు ప్రయత్నములు సలుపవలసివచ్చెను. నాకు ఒక్కటే ఉపాయము దోచెను. లలితవలె నేనును నవనాగరికపద్ధతుల నవలంభింపవలెనని తలంచితిని. నా తండ్రి పైకము నెంతయో వెచ్చించి, విలువగల చీరలను కొనియుంటిని. నాఅంతరాత్మకు వ్యతిరేకించి కొన్ని నవనాగరికపద్ధతుల నవలంభించితిని. అవన్నియు జెప్పుకొనుటకు నాకు చాల సిగ్గుగుచున్నది. అప్పటి నాచర్యలు కొన్ని నవ్వు పుట్టించును. మరికొన్ని విచారమును సూచించును. సంసారకష్టముల నెరిగిన ఏ సాధ్వియు నా తెలివి తక్కువదనమునకు నన్ను చులకన జేయురు-కాని నాప్రయత్నము లెల్ల వ్యర్థమయ్యెను.

సిమ్లా వచ్చిన తరువాత నాభర్త చాలా ధనమును జూదములలో పోగొట్టుకొనెను. అతని చెడు నడతలు దిన దినమునకు హెచ్చుగుచుండెను. నానగల నెల్ల దీసుకొనెను. నామనస్సున కెంతయో రోత కలుగ జేయుచుండెను. లలితకై కొన్ని నగలను కొనెను. విలువగల చీరలనుగూడ యామెకు కొనెను.

వేసవి ముగిసినందుకు తిరిగి మేము కలకత్తా వచ్చితిమి, కాని లలిత మమ్ము విడువలేదు. కలకత్తావచ్చిన పిమ్మట నాభర్త నన్ను తరుచు పైకమునకై బాధించుచుండెను, నా

తండ్రిపైకమును బ్యాంకునుండి రాబట్టి యాతనిదుర్వ్యయమున కొసగ నాకిష్టములేదు. నాతండ్రికిదంతయు దెలుపవలెనని నేను నిశ్చయించుకొంటిని. తనవకీలును ఒక పర్యాయము కలకత్తాకు బంపమని కోరుచు తంతినిచ్చుటకై నేను జి. పి. ఓ కు వెళ్ళితిని.

# అధ్యాయం ౭

నేను తంతివార్తను కాగితముపై వ్రాసి సరిజూచుచుంటిని. అంతలో నెవరో నాప్రక్కనుండి విసుగున వెళ్ళుచుండిరి. నేను నాముఖమును ప్రక్కకు త్రిప్పిచూచితిని. ఆవ్యక్తియు, వెనుకకు తిరిగి నన్నుచూచెను. "శశీ! నీవా యని ఆయన నన్ను సమీపించి, నా రెండు చేతులను బట్టుకొనెను. ఆహా! ఏమి నా ఆనందము. నా బాల్యమిత్రుడు నళినరంజనుడు నాయెదుట ప్రత్యక్షమయ్యెను. హిమవత్ యాత్రకుబోయి హిమవంతమైన మారుతమును నాపై వీచెను.

"నళిన్! నేడు నాకిది సుదినము. నాఆనందమును నేను వర్ణింపజాలకుంటిని.

"శశీ! నీవు నా నేత్రములకు పండుగ యొనర్చితివి. నీ విక్కడి కెప్పుడు వచ్చితివి? ఇందుండుటకు కారణమేమి? అని యాతడు ప్రశ్నించెను. నా ఆనందపరవశతచే నానోటమాటగూడ చెప్పజాలకుంటిని. ఊపిరితీసుకొని ఎట్లో యాతనితో మాట్లాడగలిగితిని.

"నళినరంజన్! నేనిచ్చటికివచ్చి కొద్దిమాసములు గావచ్చినది, తరువాత నేను సిమ్లాకూడా వెళ్ళియుంటిని.

నావివాహమైనట్లు కెట్లురయాతనికి జెప్పవలయునో నా తెలియకుండెను. పిమ్మట యాతనిని వెంటబెట్టుకొని మాహోటలు వైపునకు నడచుచు,

"నళినరంజన్! మీపర్వతారోహణ మెంత వరకు జరిగినది?"

"ప్రస్తుతము పర్వతారోహణము జరుగలేదు. కాని మేము రెండవ పర్యాయము వెళ్ళునప్పుడు కృతకృత్యులము గుటకు తగిన యేర్పాటులెల్ల జేసుకొని యుంటిమి. పాశ్చాత్యులు తమ దేశమునకు వెళ్ళియుండిరి. ఈపర్యాయము వెళ్ళుటకు నేనే స్వయముగ ప్రయత్నించుచుంటిని. బహుశా ఈ సంవత్సరము లోనే ప్రయాణమగుచుంటిమి.

ఇంతలో మేము హోటలుచేరితిమి. నాభర్త లలిత మేడ మెట్లు దిగి క్రిందికి వచ్చిరి. అప్పుడు కొద్ది మాటలతో నళినరంజనుని వారికి పరిచయము మొనర్చితిని. నాభర్త నళినరంజనుని ఒకేస్థలమందు ఒకేకాలమందు జూడగలిగితిని. వారి రూపురేఖలందు సంభాషణయందుగల వ్యత్యాసమును జూడ గలిగితిని. నళినరంజనుని యువ్వన సౌందర్యము గానవగు చుండెను. నాభర్తయో! యువ్వన వయస్కుడయ్యు యువ్వన చిహ్నములాతని యందు నశించెను. నళినరంజనుని తనకు తీరిక యైనప్పుడు ఒకపర్యాయమువచ్చి మాతో భుజించుట కాహ్వ నించి నాభర్త లలితతో గలసి బయటకు వెళ్ళిపోయెను. పిమ్మట నళినరంజనుడు "శశీ! కలకత్తాలో నేనింకను కొన్ని దినము

లుండెదను. నాకు తీరిక యైనప్పుడెల్ల వచ్చి నిన్నుజూచి పోయె దను. నేను చేయువలసిన పని యెద్దియైనను కలదా! వలయుచో నన్నే సమయమునందైనను సరియే పిలువుము" అని బలికిన తన టెలిఫోను సంఖ్యను నాకొసంగి వెళ్ళెను. నాకు చాలా ధైర్యము కలిగెను. నళినరంజనునుండి నాకింకే భయము లేదని నమ్మియుం టిని. నా చేతిలోని తంతి కాగితము నలిగియుండెను. దాని సంగ తియే మరచిపోతిని. ఇంక దాని అవసర మెద్దియు లేనందున చించి పారవైచితిని.

నళినరంజనుడు తరచు నన్ను జూచుటకు వచ్చుచుండెడి వాడు. ఆతడు వచ్చుచుండుట నాభర్త కిష్టమున్నను లేకున్నను, లలిత మాత్రము చాలా సంతసించుచుండెడిది. నళినరంజనుడు నన్ను తనవెంట కొన్నివిందులకు గొనిపోయెను. వాటికి నాభర్త యనుమతి బడయుచుండెడి దానను యనుమతి కోరినవెంటనే లలిత నావిషయమై సిఫారసు చేయుచుండెడిది. నళినరంజనుడు నాతో నెన్నియో విషయములనుగూర్చి ముచ్చటించుచుండెడి వాడు. కాని నాభర్తను గూర్చిగాని, వివాహమునుగూర్చిగాని నా వివాహమునకు ముందు నాతండ్రికి శాస్త్రీజీకి తాను వ్రాసిన ఉత్తరములను గూర్చిగాని, నాతో నెన్నడును ప్రసంగించలేదు. నళినరంజనునితో నాకుగల స్నేహమునకు నేనెంతయో యుప్పొంగుచుంటిని. అది లోకవిరుద్ధముగ నాకు కానబడుట లేదు. ఏ ప్రేమకై నేనన్వేషించుచుంటినో, ఆ ప్రేమనాకు తెలియకయే నాయందు జనించెను.

ఒకనాటి ఉదయము నేను నిద్రనుండి మెల్కాంచితిని. సూర్యరస్మి నాపైబడుచుండెను, నళిని రంజనునిపై ప్రేమ నాలోనుదయించెను. అదెట్లు జరిగెనని నేను యోచించుచుంటిని. నేను నళినిరంజనుని ప్రేమించితిని. ఆతడు నామనస్సును హరించెను. నామనస్సులో నాతని మూర్తి హత్తుకొనినది. ఆతడు నాలో ప్రేమజ్యోతిని వెలిగించెను. నాదుఃఖమును ఆనందమయము మొనర్చెను. కాని ఆ ఆనందము నాలో కొన్ని నిమిషములు మాత్రమే యుండెను. నామనస్సు నళినరంజనునిపై లగ్నమైనదని గ్రహించితిని. అదిదోషమనినాకు దోచెను. నేను వివాహితను. నాభర్తను తక్క వేరొక పురుషుని ప్రేమించిన మహాపాపము నాకు సంభవించునని నేను తలచితిని. నళినరంజనునితో నాకుగల పరిచయమును ఉపసంహరించుకొనవలెనని నేను నిశ్చయించుకొంటిని. పలువురు నాపై కుట్రపన్ని నన్నాతని కౌగలిలోనికి ద్రోయ నుంకించుచున్నట్లు నాకు కానబడుచుండెను. వారిలో లలిత యగ్రస్థానము నలంకరించుచుండెను.

లలిత ప్రోత్సాహముపై నాభర్త నళినరంజనుని ఒకనాడు విందున కాహ్వానించెను. నళినరంజనుని రాక నాకు చాల సౌఖ్యమును చేకూర్చెను. నళినరంజనుడు వసించువాతావరణమే వేరు. నాభర్తగాని లలితగాని భోజనముచేయునప్పుడు మంచి జాతికుక్కలను గూర్చియు, గుర్రములు గుర్రపుపందెములను గూర్చియు ముచ్చటించుచుందురు. కాని ఆదినమం

దా ప్రసంగమే లేదు. నళినరంజనుడు ప్రకృతిని గూర్చియు, ప్రకృతి సౌందర్యమును గూర్చియు, హిమాలయపు గాంభీర్యమును గూర్చియు నుచ్చరించెను. ఆసంభాషణ నన్నుచాల ఆనందభరితునిగా జేసెను.

మరునాడు నళినరంజనుడు నాగదిలోనికి దొందరగ ప్రవేశించెను. అతని చేతియందు ఒక యుత్తరముల కట్టయుండెను.

నళినరంజనుడు నవ్వుచు— "యజమానుని యొక్క ఉత్తరువు గైకొని నేనులోనికి ప్రవేశించితిని. ఇప్పుడు నేనునీకెట్టి పనియివ్వనుంటినో జూచుకొనుము" అని చమత్కారిగా బలికెను. ఆ యుత్తరములన్నియు, దేశమునందలి వివిధవార్తాపత్రికాధిపతులయొద్దనుండి వచ్చియుండెను. కొందరు నళినరంజనుని చిత్తరువును బంపమనిరి. కొందరాతనితో సమావేశము నర్థించిరి. ఒక హిందుస్థానీ పత్రిక; మరొకవంగపత్రిక హిమాలయపు పర్వతారోహణమును గూర్చియు, ఆరోహకుల యుద్దేశముల గూర్చియు ప్రత్యేక వ్యాసమును వ్రాసి బంపుమని నళినరంజనుని కోరిరి. నళినరంజనుడు కార్యశూరుడేగాని, వ్రాతయందంత అనుభవములేదు. అందుచే నాసహాయము నాతడర్థించెను. అందులకు నేనియ్యకొంటిని. నళినరంజనుడు తన భావమును నాకు దెలియజేసెను. నేను కొద్దిసేపటిలో రెండు వ్యాసములను వ్రాసి యిచ్చియుంటిని. అదిజూచి నళినరంజనుడు నన్నెంతయో పొగడెను.

తరువాత ఆవ్యాసములు వార్తాపత్రికలలో ప్రచురింప బడెను. ఎప్పుట జూచినను ప్రజలు నళినరంజనుని గూర్చియు, అతని సాహసములను గూర్చియు చెప్పకొను చుండిరి. నాభర్త, లలితవంటి వారుమాత్రము "అది కల్ల, అది అసంభవము" అనుచుండిరి. క్రమముగా నళినరంజనునకు ఉత్తర ప్రత్యుత్తరములు హెచ్చెను. అందుచే అతడు ప్రతిదినము నావద్దకువచ్చి, నాసహాయము కోరుచుండెను. అతని కార్యమును నెరవేర్చుట నాకుచాలా ఉత్సాహముగ యుండెను.

నళినరంజనుని పేరు దేశమంతటను వ్యాపించుచుండెను. వంగదేశమందు, ముఖ్యముగ కలకత్తాలో అతని నెంతయో గౌరవించుచుండిరి. పెక్కుసభలందు ఆతనికి సన్మానము లొసగిరి. ఆతడు ముందు జరుపనున్న శిఖరయాత్రకై చాల ధనమును చేకూర్చు చుండిరి.

నళినరంజనునిపై నాకుగల ప్రేమ చాలాస్వచ్ఛమైనది, అది అకలుషిత మైనది. కాని నాహృదయము నన్నుద్రోహము చేయుచున్నదని తలంచుచుంటిని. నాపాప పరిహారార్థమై అను దినము కాళికాలయమునకు వెళ్ళి, ప్రార్థన సలుపు చుంటిని. దుష్ట యోచనలను నాతలపునుండి దూరము గావించమని దేవికి మ్రొక్కుచుంటిని. కాని యేమి ప్రయోజనము? నిద్రలో కల గాంచుచు, నళినరంజనుని కౌగిలిలోనికి బడుచుంటిని. నాదాసి లక్ష్మి (కలకత్తాలో క్రొత్తగ నావద్ద వచ్చిచేరెనే) ఎల్లప్పుడు నళినరంజనునే పొగుడుచుండెడిది. అతడు సుందరాకారుడు—

సంతోషసాగరుడు—భీమబలుడు—అట్టిపురుష సింహుని ఏ స్త్రీ వరించినను మన్నింపతగును. అని పదేపదే అనుచుండెడిది. ఆమెపలుకులు నాచెవులకు సంగీతము గొలిపెడివి. ఒక్కొక్క ప్పుడు దానిని కౌగలించుకొని ముద్దిడు కొనవలె ననిపించెడిది. కాని మరొక సమయమందు దానిని రాచిరంపమున పెట్టవలె నని యనుకొనెడి దానను. అఖిలాండకోటికి సృష్టికర్తయగు ఆ పరాత్పరుని పొగడి హృదయమును పవిత్రము గావించుకొను టకుమారు, పరమానవుని నాయెదుట శ్లాఘించుట నేను సహింపజాలకపోతిని. అప్పుడు దాని కాటుక కండ్లు నీరు నించెడివి.

*   *   *   *   *

యోచనలతో నామనస్సు చలించిపోవుచుండెను. అందుచే కాళీగంజికి పోవలెనని నాకు కోరిక జనించెను. నా భర్త కది దెలిపితిని. "శశిరేఖా! నాకాచిన్నగ్రామమం దేమి యు తోచదు. అయినను ఒక నిబంధనపై నేను వచ్చెదను. నా స్నేహితులు కొందరు నా వెంటవచ్చిన నీకెట్టి యభ్యంత రము యుండరాదు" అని నాభర్త జవాబొసగెను.

"అది మీగృహము. మీరు యథేచ్ఛగా సంచరింప వచ్చును." అనినేను బలికితిని. నాభర్త వెళ్ళిన ఒకక్షణములో లలిత నాయొద్దకువచ్చి, నాప్రియమైన శశీ! మీరు మీ

స్వగ్రామము వెళ్ళుటకు నిశ్చయించుకొనిరట—రాజాసాహెబ్ నన్నుకూడ మీవెంటరమ్మని నన్నాహ్వానించుచుండెను. కాని నీ ఇష్టము లేనిదే నేను వచ్చుటకు సంశయించుచుంటిని. మీ వెంట నన్ను రమ్మనమనెదవా ?"

అట్టిసమయమందు నేనేమని చెప్పగలను ? నేనప్పుడేమి చెప్పితినో నాకేజ్ఞాపకములేదు. కాని ఆమరుక్షణముననే లలిత నన్ను కౌగలించుకొనెను.

మేము కాళీగంజికి వెళ్ళుచున్నట్లు నళినరంజనుని కెరింగించితిని. అతడు బండి వెళ్ళుటకుముందు పిరొమెల్ డా స్టేషనుకు వచ్చెను. లలితకూడ మావెంట వచ్చుచున్నట్లు గ్రహించి నాతో "ఆస్త్రీని జూచిన నాకసహ్యము అది సర్పమువంటిది. ఎప్పుడో యొకప్పుడు దానిని నాపాదముల క్రిందబెట్టి అణగ ద్రొక్కెదను." అనెను. "శశీ! డాక్టరుబాబు కాళీగంజి వచ్చినప్పుడు మీభవనమునకు వచ్చి రెండుమూడు దినములచ్చట గడుపుట కాహ్వానింపుము." అనెను. నాకాపలుకులు చాలసంతసమును గొలిపెను. అయినను నేనాతనితో "వలదు. ఆతనికి కాళీగంజిలో తొందరపనులు చాల యుండును." ఆమాట విని నళినరంజనుడు అబల సంతోషియై "నేను తప్పకవచ్చెదను. అంతకుమించి నాకు కావలసినదేది ?" యనెను. అప్పుడు లలిత విజయ సూచకముగ ఒకచిరునవ్వు నవ్వెను. మాబండి కదిలెను. నళినరంజనుడు నావైపు జూచుచు అట్లే నిలచి యుండెను.

శాళీగంజ చేరిన వెంటనే మేము రెండు మోటారులపై "రమాభవనము" ను చేరితిమి. సరియైన రక్షణలేక భవనము చాల పాడుబడెను. తోటకూడ అదేస్థితియం దుండెను. సేవకులువచ్చి మాసామానెల్ల గొనిపోయిరి. మేడపై దక్షిణభాగము నా ఆధీనమందుండెను. మేమువచ్చిన సంగతి తెలిసి మాపిన్ని, గంగ నన్ను జూచుటకై వచ్చిరి. వారు నాపై అప్పుడు చాలా ప్రేమను జూపిరి. నేనుచాలా చిక్కితినని మా పిన్ని చింతించెను. వారువచ్చిన కొలదిసేపటికి నాతండ్రి వచ్చెను.

మాక్షేమమెల్ల అరసిన వెనుక "శశీ! నీవు సిమ్లాలో ధనమును నీటివలె ఖర్చు పెట్టితివి కానిమ్ము. నీ సౌఖ్యముకంటె నాకది ఎక్కువలోనిదికాదు" అనెను. పిమ్మట నాతండ్రి నళినరంజనుని అభివృద్ధినిగూర్చి చాల ప్రసంసించెను. తరువాత నాతండ్రి నాభర్తనుజూచి "రాజా సాహెబ్! మీభవనము చాల పాడుస్థితిలోనుండెను. దానిని సరియైన పద్ధతులలో బెట్టుటకు నాయింజనీరు నుఈదినమే పంపెదను. మీతోటను బాగుగ యుంచుటకు మాకృష్ణదాసునుకూడ బంపెదను. అనిచెప్పి వెళ్ళిపోయెను. వారివెనుకనే మాపిన్ని గంగకూడ" వెళ్ళియుండిరి.

మేము వచ్చిన మరుచటి దినమునుండి లలిత మాగృహాధికార మంతయు తనయధీనములో నుంచుకొనెను. నాశరీర పరిస్థితి బాగుగ లేనందున తానా భాధ్యత వహించితినని నాకు

సాకు జెప్పెను. క్రమముగ లలిత నాపైగూడ యధికారము చేయుచూనెను. సేవకులెల్లరు ఆమెనే యజమానురాలిగ భావించి యామె యుత్తరువులకు మెడలొగ్గుచుండిరి. నారాణి పదమెల్ల నిష్ఫలమయ్యెను. తోటమాలి కృష్ణదాసు, నాదాసి లక్ష్మిదక్క నామాటవినువారు ఆభవనమందు మరెవ్వరును లేరు. ఆభవనమందు వసించుట నాకుచాల అవమానకరము గనుండెను. గనుక నాభర్తను ఎడబాసి యుండుటయే నాకు గౌరవ పదముగ దోచెను. అక్కడ నారాణి వాసముకంటె అరణ్యవాసమే మేలనిపించెను.

మానాన్నగారికి కొంచమస్వస్థతగ నున్నట్లునాకు దెలియవచ్చెను. వారిని జూచుటకై నేనొక మోటారులో పట్టణములోనికి బయలుదేరితిని. మొదట నేను నాతండ్రి వకీలువద్దకు వెళ్ళి నాపరిస్థితులెల్ల ఆయన కెరిగించి, ఎట్లయిన నాభర్తతో నాకెట్టి సంబంధము లేకుండ జేయుమని యాతనిని కోరియుంటిని. వకీలు నేను చెప్పినదంతయు శ్రద్ధతో విని, అట్లుగావించుటకు హిందూశాసనము నందెట్టి యాధారమూ లేదని నాకు దెలిపెను. పిమ్మట నేను శాస్త్రిజీ గృహమునకు వెళ్ళితిని. శాస్త్రిజీ నారాకవిని పరమానంద భరితుడై నాకెదురువచ్చి లోనికి తోడ్కొనిపోయెను. కుశలప్రశ్నలు గావించిన పిమ్మట నేను నాస్థితి గతులెల్ల ఆయనకు ఉన్నదున్నట్లు వచించితిని. నాయుద్దేశ్యమును గూడ నెరింగించితిని. శాస్త్రిజీ అవన్నియు శాంతముతో వినెను. నాప్రేమ వేరొక యువకునిపై లగ్నమైనదనియు,

అది పవిత్ర ప్రేమమనియు, వచించితిని. శాస్త్రీజీ ముఖము ఎఱ్ఱబడెను. శాస్త్రీజీ కోపము నేనెప్పుడు జూచియుండలేదు. నా ప్రేమ ఎవరిపై లగ్నమైయుండెనో శాస్త్రీజీ గ్రహించెను. నళినరంజనుని దూషించెను. శాస్త్రీజీకి నళినరంజనుడన్న చాలదయు ఆతని యోగ్యతలెల్ల శాస్త్రీజీకి చిన్ననాటనుండియు దెలియును. అట్టి ప్రయత్నములనుండి విరమించుమని నన్ను మందలించి, హిందూదాంపత్య ధర్మములను నాకెరింగించి నన్ను సాగనంపెను.

నేను వచ్చునట్లు తెలిసియున్ననూ, నా తండ్రిగృహమందెవ్వరునూ నారాకకై ఎదురు చూచుటలేదు. నేను నేరుగా తండ్రిగదిలోనికి వెళ్ళియుంటిని, ఆయన ఒక మంచముపై పరుండి యుండెను, నన్నుజూచినవెంటనే నన్ను తన సమీపమున కూర్చుండబెట్టుకొని, తనశరీర పరిస్థితులు నాకెరింగించెనును. తరువాత నాస్థితిగతులు తెలియజేయుట కిదియే మంచి సమయమని తలచితిని. అతికష్టముపై నా సంసార కష్టములెల్ల నాతండ్రి కెరింగించితిని. అదివినిన నాతండ్రికి నాపై జాలికలుగునను కొంటిని. క్రోధోజ్వలుడై నాభర్తకు తగిన బుద్ధి జెప్పునను కొంటిని. కాని ఒక్క నవ్వు నవ్వెను. నేజెప్పునది ఆయన కర్థము కాలేదనుకొని మరల విపులముగ జెప్పితిని.

"శశీ! నీవు నీభర్తపై నన్ను యుద్ధమునకు పురికొల్పుచుంటివా? ఇవా నీసని-మీాతగవు లందు నేను పాల్గొనను.

నీయింట నున్న యీదుదానిని నీవుబయటకీడ్పింపుము. నీకా తెలివితేటలు కలవు. వలయుచో పైకము నేనొసగెదను. అదియే నేను-నీకొసగ జాలిన సలహా, ఆపలుకులకు నాకు చాల దుఃఖము వచ్చెను. నేనింక ఎవరితో మొరబెట్టుకొనగలను? నామనో రంజనుడగు నళినరంజనుడు దక్క వేరొకరు లేరుగదా?

ఆ రెండవ దినము నేను "రమాభవనము" న కరిగితిని నేనువెళ్ళుసరికి ఒకరిద్దరు సేవకులు, నాదాసి లక్ష్మిదక్క వేరెవ్వరును అందు లేరు. లక్ష్మినాకొకయుత్తర మొసగెను. అది లలిత నాకొసగినట్లు తెలిపెను. ఆ ఉదయమే నాభర్త లలితను దీసుకొని డార్జిలింగునకు వెళ్ళినట్లును, వారము దినముల వరకు వారు తిరిగిరారనియు, లక్ష్మి నాకెరిగించెను. కవను చించి లలిత వ్రాసిన ఉత్తరమునుచూచితిని. అందు మరొక చిన్న ఉత్తరముకూడ యుండెను. అది నళినరంజనుని వద్దనుండి నాకు వచ్చెను. తాను కాళీగంజికి రెండు దినముల క్రితము వచ్చితిననియు నాలుగుదినములలో మాభవనమునకు రానై యున్నటుల నాకు తెలియజేసెను. తరువాత లలిత వ్రాసిన ఉత్తరమును చదివియుంటిని.

"నా ప్రియమైన శశీ!

నీకు తెలుపకయే మేమిప్పుడు డార్జింగున కేగుచున్నందులకు చాలా విచారించుచుంటిని. నీవునన్ను క్షమింతువుగాక-గతరాత్రి పదిగంటలవరకు ఈ ప్రయాణము మా తలంపులో నే లేదు.

డాక్టరు నళినరంజన్ ఛటర్జి కొన్ని దినములలో నిన్ను జూచుటకు రానైయున్నాడు. శశీ! నీ యదృష్టమును నేనేమని పొగడగలను! నీకు శుభమగుగాక —

ఇట్లు, నీ ప్రేమాభిలాషి లలిత,

ఆయుత్తరము చూచి, లలితపై కోపము జనించెను. నళినరంజనుడు రానైయున్న సంగతి నాకెంతయో యుల్లాసమును కలిగించెను — ఆతని రాకకై నేనెదురు జూచుచుంటిని.

# అధ్యాయం ౮

నళినరంజనుడు "రమాభవనము" నకు వచ్చెను. భవనములో పడమటివైపున ఒకగదిలో ఆతని సామాను పెట్టించితిని. స్నానపానములైన పిమ్మట బాల్కనీ (మేడముందరి వసారా)పై మేమిద్దరము నిలుచుని యుంటిమి. నళినరంజనుడు రమాభవనమున కెదురుగానున్న ప్రదేశమును తిలకించుచుండెను. అంతలో కృష్ణదాసు మావైపునకువచ్చి పూల మొక్కలకు నీరు పోయుచుండెను. నళినరంజనుడాతనిని జూచి చటాలున క్రిందికిబోయి కృష్ణదాసు భుజములను బట్టుకొని నవ్వుచు అతని ముఖమును తేరి పారజూచెను. కృష్ణదాసు తన ఆనందమును బట్టలేక నళినరంజనుని చేతులను తనకన్నుల కద్దుకొని, 'భగవంతుడు మిమ్ము రక్షించుగాక — ఈ ముసలి వానిని మీరు మరువలేదు.' అనెను. ఆదృశ్యమును జూచి నేను నళినరంజనుడు కృష్ణదాసొసగు పళ్లు తినుచూ ఆతనిని కథలు వినుచూ, నవ్వుచూ సంతోషముగా మెలిగిన చిన్ననాటి సంగతులెల్ల జ్ఞాపకమునకు వచ్చెను.

ఆదినమంతయు నేను నళినరంజనునితో సంతోషముగ గడిపితిని. నళినరంజనుడు నన్ను బట్టుకొనెను. నాశరీరములో

విద్యుచ్ఛక్తి ప్రవహించినట్లయ్యెను. నా చేయిబట్టుకొనియే అతను చాలా దూరము నడచెను.

చీకటి పడగనే మేము తిరిగి భవనమునకు వచ్చితిమి. భోజనమైన పిదప నళినరంజనుడు నాగదిలో కూర్చొనెను. తాను ఉదయమే కలకత్తా పోవలసి యున్నదని నాకు చెప్పెను. నా మనస్సు కలచినట్లయ్యెను. నాకు తెలియకుండగనే నా కన్నులనుండి నీరు జారుచుండెను. అది జూచి నళినరంజనుడు "శశీ! నా యుద్దేశమును నీకు చెప్పవలెనను కొనలేదు. కాని అది చెప్పక తప్పదు. నీవు కష్టసముద్రములో బడి యీదులాడుచుంటివి. నిన్నీస్థితిలో జూచుచు సహించి యుండజాలను. నిన్ను ఇంక బాధపడనివ్వను." యాతనికిజవాబొసంగవలెననియనుకొంటిని కాని నానోటమాట వచ్చుటలేదు.

"నేను శిఖరారోహణమునకై వారము దినములలో ప్రయాణమగుచుంటిని, నిన్నిట్టికష్టదశలో విడిచిపోవుటకు నాకాళ్లాడుటలేదు. "శశీ! నీకుసహాయం చేయుటకు సిద్ధముగ వుంటిని. కాని నీవు నాకా యధికార మివ్వవలెను."

అతడు చెప్పబోవునది నేను గ్రహించితిని. ఏమన? అతనికంఠమందు వణకుపుట్టెను. అదినా చెవిలో తూరీణమువలె ధ్వనించుచుండెను. కళావిహీనమైన యాతని మోముగాంచి, నా హృదయము నన్ను రాచి పెట్టుచుండెను. నాకంఠమును పీడించుచుండెను. నా విషయమై ఖేదింపవలదని యాతనికి దెలుప ప్రయత్నించితిని.

"నళినీ ? నీవు యౌవ్వన ప్రాబల్యము నందుంటివి, రానున్నకాలమునీకు సౌఖ్యమును చేకూర్చును. ఏమనిననైన చేబట్టితివేని, నిన్నాప్రేమ సాగరమున యోలలాడించ గలను." అని నేనింకనూ జెప్పబోవుచుండ, నామాటకు నళినరంజనుడడ్డుపడి 'శశీ! అదెప్పటికిని జరుగబోదు. నాహృదయపూర్వముగ వరించిన నిన్ను, ఎప్పటికైన బడయజాలనిచో, నాజీవిత పర్యంతము అస్ఖలిత బ్రహ్మచారినై, ప్రపంచ సుందెంద్రన మునిగి యుండెదను." అని పలికెను.

"నళినీ! నీవు నన్ను విడువవలెను."

"శాశ్వతముగనా ?"

"ఆ——అట్లేయగుగాక !"

"అట్లయిన నీజ్ఞాపకార్థమై నాకేద్దియైన నిమ్ము."

"అట్లు చేయకుండుటయే మంచిది" అని నానోట వెలువడెనేకాని, ఆదేసమయమందు నాచేతియందలి రుమాలు నేలపైబడెను. నళినరంజనుడు దానిని తీసుకొనెను. చెక్కిలిపై కన్నీరు జారుచుండెను. నళినరంజనుని వదనము కందియుండెను. నళినరంజనుడు తన మనో స్వాధీనమును తప్పియుండవచ్చును.

గభాలున తలుపు బందించి, ఒక్కదాటున నన్ను సమీపించి. నన్ను బిగియార తన కౌగిలిలోనికి కిముచ్చుకొని కామ ప్రేరితుడై నన్ను ముద్దిడుకొని "శశీ! నీవు నాహృదయేశ్వరివి. నిక్కముగ నేనే నీమనోహరుడను. ఆ ద్విపాద పశువు

నకు వివాహము గావింపబడిన మాత్రమున నిన్ను విడువను. కాని నీ అంతరాత్మకై ... ...మనప్రేమ అమోఘమైనది. అది శాశ్వతమైనది. నీవు యెచ్చట యున్నను, నిన్ను వారేమిచేసినను, నీవు నాదానవే—

నారక్తము యుడుకుచుండెను. ప్రపంచము నాదృష్టిపదమందు తిరుగుచుండెను. నాశరీరము కంపించుచుండెను. నా యింద్రియములు నాస్వాధీనము వీడెను. కాని నేను భయకంపితను కాలేదు. నేనానంద పరవశమును జెందుచుంటిని. ఆ యానందమునకై నాత్యాగశీలముల నర్పించుచుంటిని. నామనో ధీగత్వము హరింపబడెను.

అతని అధరము అమృతము స్రవింపజేసినది. నళినరంజనుడు దీపము తగ్గించెను. ——

* * * * *

మరునాడుదయము నళినరంజనుడు నన్ను వీడి కలకత్తాప్రయాణమై పోయెను. అతని మనస్సు చాల చాంచల్యము జెంది ఆత్మదూషణగావించుకొనుచుండెను. కాని నా హృదయము నిర్భయముగ నుండెను. నేనొర్చిన కార్యమునకు నేను పశ్చాత్తాపము జెందలేదు. నామనోహ్లాదమును నే నిప్పుడు వర్ణింపజాలకుంటిని. అనిర్వచనీయమైన నూతన జీవితము ఆకస్మికముగ నాలో నుదయించెను.

“శశీ! నిన్నువిడి హిమాలయయాత్రకు పోగల స్థితిలో లేనట్లు నాకు దోచుచున్నది.” అని నళినరంజనుడు నాతో బలికెను. ఆపలుకులకు నేనదరిపడి, –

"నళిన్! నీవు తప్పక పోవలయును. నీవు వెళ్లుటకు శక్తియుతుడవై యుంటివనిగూడ నాకు దెలియును." అని నేను చెప్పియుంటిని. తానుతలపట్టిన పర్వతా రోహణము అద్వితీయమైన ఘన కార్యమనియు, అది నిర్లక్ష్య పరుచుట శ్లాఘనీయము కాదనియు బలికితిని. —

"నేయొనర్పబోవు కార్యము మరియొకరి వలన కాగలదు" అని నళినరంజనుడు నుడివెను.

"అట్లు జరుగరాదు. నీవలననే అది నెరవేరవలెను. నీ ప్రయాణమునకు వలయు సన్నాహములెల్ల పూర్తియయ్యెను నీపైగల విశ్వాసమువలన ప్రజలు పెక్కుద్రవ్యమును నొసంగిరి. నీ ఆధిపత్యమున శిఖరారోహణాకై ఒక సంఘము వేచియుండెను. దేశఖ్యాతిని నీవు నిలుపవలెను. ప్రపంచహృదయము నీతోనుండెను. గనుక యేదియెట్లు జరిగినను నీవు మాత్రము వెనుదీయరాదు." అని నేను వచించితిని.

• "శశీ! అట్లయిననీవు నావెంటవచ్చి, నేను యాత్ర పూర్తి గావించి తిరిగి వచ్చు వరకు కలకత్తాలో యుండవలెను. అని నళినరంజనుడు పలికెను.

"అది అసంభవము. అని నేను జవాబొసంగితిని.

"కాని, నేను వెళ్ళినపిదప నీ వెట్టియవస్థలకు జిక్కెదవో యోచించుకొనుము" అని నళినరంజను డనెను.

"నళిన్! నీవు వెళ్ళినపిదప నాకెట్టి యాపదలు రావు.

"శశీ! భగవంతుడు భవిష్యత్కర్తయైయుండ, అది నీ వెట్లు చెప్పగలవు?"

"అట్లయిన భగవంతుడే నాకుశక్తి నొసగగలడు" అని నేను జవాబొసగితిని, దానికి నళినరంజనుడు సంతృప్తి హృదయు డయ్యెను.

"శశీ! నేను నీకొకయుత్తరము వ్రాసియిచ్చెదను. దానిని నీవు గ్రహించవలయును." అని పలికి బల్లయొద్ద కూర్చొని కొన్ని నిముసములలో ఆలేఖ నొకదానిని వ్రాసి నళినరంజనుడు నాకొసగుచు.

"నీ వెప్పుడు కష్టదశలో నున్నను, ఈలేఖ నీకుసహాయకారి కాగలదు." అని నుడివెను. దానిని నేను తీసుకొని మడచి నాచేతిలో నుంచుకొంటిని.

"నీవు దానిని చూడదలచుకొనలేదా?" అని నళినరంజనుడు నన్ను ప్రశ్నించెను.

"నేను చూడను."

"నే నెవరికి వ్రాసియుంటినో పైవిలాసమైన చూడదలచుకొనలేదా?"

"అదియు అనవసరము" అనెను.

మే మప్పుడు ఎడబాయు సమయము బహుశా ఈజీవిత చరిత్రములో చాల అందమైనది. ఆతడు నా కెదురుగనే నిలిచియుండెను. ఆసమయములో నా రెండుచేతులను యాతని మెడకు పెనవేయవలెనని తలచితిని. కాని నే నట్లు గావించినచో, నన్నువిడచిపోవుటకు యాతనికి చాల కష్టము కలుగును. ఆతడును నాపట్ల అట్టి స్థితియందే యుండునని నేనుగ్రహింప గలిగితిని. అప్పుడు నళినరంజనుడు నాకుడిచేతిని

తన రెండు చేతులతో దీసుకొని “ శశీ ! మన ప్రేమబంధ మెన్న టికిని వీడునదికాదు. ”

“ నళిన్ ! అది యదార్థము”

“మనకెప్పుడేది తటస్థించినను మన ప్రేమ స్థిరత్వమును వహించియుండగలదు.”

“ఎప్పటికైనను సరియే.”

“శశీ ! నిన్ను విడిచి చాల దినములు యుండ వలసి వచ్చును.”

“ నేను వేచియుండగలను.

“ నేనెట్టి అపాయస్థితిలో నైన చిక్కిన చిక్కవచ్చును.

“ భగవంతుడు నిన్ను కాపాడుచుండును. నీవు కీర్తియుతుడవై తిరిగి రాగలవు.

“ అట్లేయగుగాక. కానినేను తిరిగి... రాలేనిచో— ”

ఆతడు చెప్ప బోవునది నేను గ్రహించితి. మామధ్యనీడ బడుచున్నట్లయ్యెను. నాగొంతుక బొంగురు బడుచుండెను. కొంతసేపటి వరకు నానోట మాటయే వెలువడలేదు. కాని కొంత వడికి.

“ నళిన్ ! మృత్యువుకంటె ప్రేమయే బలయుతమైనది. అదియే శాశ్వతమైనది ” అని నేను బలికితిని.

ఆతని చేతులు వణుకుచుండెను, ఆతని శరీరమెల్ల కంపించుచుండెను. ఆతడు నన్ను గాఢాలింగనము గావించుకొనునని కొంటిని. కాని తన వేడిదైన చేతిని. నానుదురుపై నుండి

జారవిడిచి ముద్దిడుకొనెను. అంతలో నాకండ్లముందు మంచు కమ్ముకొని నల్లయ్యెను. మంచు వీడునప్పటికి తలుపుదెరుచుకొని నామనోరంజనుడు వెడలిపోయెను.

నళినరంజనుడు నన్నువిడచి వెళ్ళిన స్థలమందే నిలచి యుంటిని. కొన్నినిమిషములలో మోటారు యేగుచున్నట్లు నా చెవులకు వినబడెను. ఆ తలంపు నన్ను వీడిన పిమ్మట జూచుకొనగా నావామ హస్తమందు నళినరంజనుని లేఖ తడిసియై యుండెను. అప్పుడు దానిని చింపి పారవైచితిని.

నళినరంజనుడు వెళ్ళిన రెండుగంటలకు నామనస్సు కుదుటబడెను. ఎన్నడునూ లేని సౌఖ్యము నాకొదవెను.

నాదాసి లక్ష్మి నాకై నాస్తాదీసుకొని వచ్చెను. అది భుజించి తేనీరు త్రాగిన పిమ్మట నళినరంజనుని శ్లాఘించుచు వ్రాసియున్న వార్తాపత్రికల యొక్క కత్తిరింపులను దీసి జదువుచుంటిని.

అంతలో డార్జిలింగునుండి నాభర్త లలిత తమ పరివారముతో భవనము చేరిరి. వచ్చినదే తడవుగ, లలిత నాగదిలోనికి ప్రవేశించి ' అట్లయిన శశీ ! నీ ప్రియమిత్రుడు ఇప్పుడేనా వెళ్ళినది ? మేమాతనిని మరల జూచు భాగ్యము కలుగలేదు. మేము చాల దుఃదృష్టవంతులము. ఏమైనను కానిమ్ము. ఆతని రాకవలన నీకు చాల సౌఖ్యమొదవెను.

శశాంకుని ధిక్కరించు నీ చక్కటి వదనమే పలుకు చుండెను. ” అని నుడివి, ఆగది విడిచిపోయెను. నేనామె పలుకుల కేటికిని ప్రత్యుత్తర మొసగలేదు.

నాభర్తనాతో మునుపటికంటె హెచ్చు పరస్పరముగ గృహమందు మసలుచుండెను. నేను దానికి లక్ష్యపెట్టకయే మెలగుచుంటిని, నళినరంజనుడు నన్నువిడిచి వెళ్ళిన పదిదినములకు తాను హిమాలయ శిఖరారోహణమునకు తనయనుచరులతో ఆదినమే బయలుదేరు చున్నట్లును, నాక్షేమమును కోరుచును ఒక తంతి నంపెను. రెండవదినము వార్తాపత్రికలలో నళినరంజనుని ప్రయాణమును గూర్చియు, ఆతనికి కలకత్తానగరవాసులు యొసగిన వీడ్కోలునుగూర్చియు ఘనముగ ప్రసంశింప బడెను.

ఒకవారముదినములు గడిచినపిమ్మట, తన కేద్దియో కొందర పను లున్నందున నాభర్త కలకత్తా వెళ్ళెను. ఆ సంగతి ఆ రెండవ దినమువరకు నాకు తెలియనేలేదు. అదేమో కాని ' లలితమాత్రము భవనమునందేయుండి తన యధికారమును ఎప్పటివలె చెలాయించుచుండెను. నాయందుమాత్రము కపటప్రేమాదరణలను జూపుచుండెను. కాని నాదాసి లక్ష్మి చాల మెలుకువగలది. లలితయొక్క కపటనాటకమును నే నెరుంగకుంటిననియు, నాభర్త కలకత్తా వెళ్ళినను, లలిత యాతనిని యనుసరింపక "రమాభవన" మందే యుండుట కేద్దియో క్రూరయోచన లామె మన మందున్న దనియు నా కెరింగించుచు, నన్ను పలుమారు హెచ్చరించు చుండెను నాయం దేద్దియో అనుమానముకలిగి, నాకద్దియైనసంభవించిన ఉల్లాసముతో నద్దానిని నాభర్త కెరింగించుటకై వేచియుండె

వని లక్ష్మి నాకెరింగించెను. ఆపలుకులు నాకు జ్ఞాపకమువచ్చి నప్పుడెల్లా నామనోబాధ హెచ్చగుచుండెను. ఒక రక్కాసి నన్ను పలుబాములు గుడుపుటకు నాయింటనే వేచియుండుట నాకస్వస్థత కలుగజేసెను. రోజులు గడిచినకొలది, నాకు భోజనము హితవగుటలేదు. రెండుమూడు పర్యాయములు విస్త్రాణచే నేను సొమ్మసిల్లితిని. లలిత నాస్థితిగని గొల్ల కని పెట్టుచునే యుండెను. నాకస్వస్థతగ యుండెనని నాతండ్రికి తెలియజేసెను. డాక్టరు సునీలచంద్రబాబు వచ్చువరకు నా కీసంగతియే తెలియలేదు. డాక్టరు బాబు నానాడిని పరీక్షించి నాశరీరస్థితినిగూర్చి కొన్నిప్రశ్నలు వేసెను. వాటికన్నిటికిని జవాబొసగితిని. డాక్టరుబాబు చిరునవ్వుతో " శశిరేఖాదేవి ! నీకు శుభమగుగాక ! నీతండ్రియొక్క అభీష్టము నెరవేరు దినము లాసన్నమైనవి. నీవు సంతోషాంతరంగివై మెలగ వలెను." అని చెప్పి, తన గృహవిషయములను, మరితర విష యములను నాకు కొన్ని యెరిగించి తాను వెళ్ళెను.

మరునాడు నాతండ్రి, మాపిన్ని గంగ కలిసి నన్ను జూచుటకై వచ్చిరి. నాతండ్రి సంతోషమున కంతులేదు. తనకు దౌహిత్రుండు జనించుననియు, తన మహదైశ్వర్యము పైయాతడాధిపత్యము వహించి తన వంశయోగ్యతలు, కీర్తిని నిలుపగలడనియు, యాతడు తలంచుచుండెను. నాతండ్రి నా క్షేమము నారసి, నేనుభవనమునందు యొంటరిగ యున్నందున

కాళిగంజి తమవెంట రమ్మనెను. కాని నాభర్త వచ్చిన పిదప యాతని యనుమతిపై వచ్చెదనని బలికితిని.

నాభర్త వచ్చిన నారహస్యము వెల్లడియగును. ఆగృహమును నేను విసర్జింప వలసినసమయము మాసన్నమయ్యెను ——

*    *    *    *    *

ఒకనాడు లక్ష్మి నాతలదువ్వుచు "రాణీసాహేబ్! మీకు నేను తెలుపలేదా? ఆపిశాచము మీవెంట నంటి కుత్రిమబుద్ధితో మిమ్ములను కనిపెట్టుచుండెను. రాజాసాహేబ్ వకు ప్రతిదినము ఉత్తరములు వ్రాయుచు మీపరిస్థితులెల్ల ఆయన కెరింగించుచుండెను. ఆపాపు స్త్రీని మన భవనము నందుండి యీడ్పించినవరకు తమ జీవితమునకు సౌఖ్యముండదు." అనెను.

ఆపలుకులకు నేనుచాలా నిరుత్సాహమునెంది, కార్యశూన్యనై నారెండుచేతులతో ముఖమునిడుకొని, లక్ష్మి! అది అసంభవము. నేనే ఈభవనమును వీడిపోయిన పరిస్థితులెల్ల చక్కబడును." అని చెప్పియుంటిని.

ఒక వారము దినములు గడచెను. నాభర్త కలకత్తానుండి తిరిగివచ్చెను. వచ్చిన వెంటనే నాగదిలోనికి ప్రవేశించి నాయెదుట నిలచెను. అతని ముఖము వాడియుండెను. అతని మనోకాఠిన్యత, నైతిక స్వభావము మోహమునందు గాన్పించుచుండెను. నాక్షేమము నారకయే తనహృదయము భారము కలుగజేయుచుండిన సంగతిని వెడల్రగక్కెను.

"నేనడుగబోవు ప్రశ్నలకు నీవు సరియైన ప్రత్యుత్తర మివ్వవలసియున్నది. డాక్టరు వచ్చి, నీశరీర పరిస్థితినిగూర్చి చెప్పి నట్లునాకు తెలియవచ్చెను. అదియదార్థమా? తరువాత నీ తండ్రివచ్చి తన వ్యామోహము సఫలమగునని సంతసించినట్లు కూడ వినియుంటిని. అదియెందులకో నీకు తెలియును. దౌహిత్రుడు......... జనించి తన మహదైశ్వర్యమున కేలికయై తనకీర్తిస్థిరస్థాయిగ యొనర్పు గలడనికదా?" అని ప్రశ్నించెను. నాభర్తకు ఆశ్చర్యముగొల్పునట్లు నేను ప్రత్యుత్తర మిచ్చియుంటిని.

"అవును. అది యదార్థమే."

"సరియే నీవందులకు యొప్పుకొంటివి. నీకాస్థితియెట్లు కలిగినది, దయయుంచి చెప్పగలవా?"

ఆప్రశ్నకు సమాధాన మనవసరమని తలచి నేనూరకుంటిని.

"అందులకు సమాధాన మొసగజాలవా? అని యాతడు నాపైగర్జించెను. ఇంకనూనేను నిశ్శబ్దముగనే యుంటిని.

"మన వివాహకాలమందుండియు, మనకథ సంపర్కా దులు నీకు తెలిసియేయున్నవి. అట్టిచో నీస్థితి యెట్లు కలిగెను? నేనందులకు నిన్నుసమాధాన మడుగుచుంటిని." అని బలికి నాజవాబునకై దృష్టినాపై నిగిడ్చియుండెను. నాశరీర మధికముగ వణకుచుండెను. కాని ఒక విధమైన ధైర్యము నాలో జనించెను. అప్పుడు నేను,

"మీరువన్నిందులకు ప్రశ్నించెదరు ? మీకాసంగతు లెల్ల తెలిసియేయున్నవి" అని పలికితిని.

"అనామధేయమైన ఉత్తరముల వలన నాకు తెలియ వచ్చిన సంగతి నిజమే——నేను నీభర్తను గనుక నీవలననే ఆసంగతులెల్ల వినుటకు నాకర్హత గలదు. గనుక సత్వరము నాకెరిగింపుము. నీకీస్థితియెట్లు కలిగినది ?" అని కఠినముగ నా భర్తనన్ను ప్రశ్నించెను.

అప్పుడు నేను నాడ్రాయరు వద్దకువెళ్ళి ఒక ఉత్తర మును దీసుకొనివచ్చి, యాతని కొసగితిని. నాభర్త అది చదివి, నేనాయుత్తరమెట్లు సంగ్రహించినదియు దెలుప గోరెను.

"మీస్నేహితురాలగు లలిత, ఇట్టి ఉత్తరములను వ్రాసి అనుదినము పోష్టునకు బంపుచుండెను. ఒక నాడది గాంచి నాదాసిలక్ష్మి, యుత్తరము గొనిపోవు వారివద్దనుండి బలిమిని దీసుకొని, ఆయుత్తరమును నాకొసగెను." అని నేను జవాబు చెప్పితిని.

"నాస్నేహితురాలగు లలితయా ?"

"అవును మీస్నేహితురాలగు లలిత——ఆమాట లకు ఆతనిముఖమందు భయసంభ్రమము లేర్పడెను. అయి నను ఆభావముల నణచుకొని.

"కానిమ్ము లలితయే కుట్రకుకారకురాలని యొప్పు కొందుము. అందు వ్రాసిన సంగతులు యదార్థము కాదనినీవు చెప్పగలవా ?

"వివాహితవు గనుక ప్రపంచదృష్టిని బడకుండగ నీవెట్టి యాటలనాడినను సాగునను కొంటివి కాబోలును." ఆమాటలను నాకాశ్చర్యమును గొల్పెను. అది అసత్యమనుట కైనను నానోటమాట రాలేదు. అంతటితో యూరకుండక నాభర్త,

"నీతప్పిదమునకు పర్యవసాన మెద్దియో నీకు తెలియునా?" అని యడిగెను.

"ఎవరితప్పిదములకు వారికే పర్యవసానము దెలియును" అని నేను జవాబొసగితిని.

"నేను మూర్ఖుడను. ఆతడు గౌరవనీయుడని తలచి నాగృహమున కాహ్వానించితిని. అందులకా కృతఘ్నుడు నాకు తగిన శాస్తి యొనర్చెను. నాభార్యను నాకు దూరముగావించెను. నాకుటుంబమునకు; కుటుంబ నామమునకు మట్టు బెట్టెను." ఆమాటలు వినినంతనే నాకు కోపము వచ్చెను. పళినరంజనుని నిందించిన నేను సహించి యుండలేకపోతిని.

"అది అసత్యము. ఆతడుమీకంటె కడుగౌరవనీయుడు ప్రపంచమే యాసంగతి గుర్తించెను. మీకంటె యాతడు మర్యాదగనే సంచరించెను. నేనెద్దియైన చెడు ద్రోవ ద్రొక్కిన చానికి నేనే కారకురాలను."

నాపలుకు లాతనికి ములుకులవలె గ్రుచ్చుకొనెను. అతనిలో ఒకవిధమైన కలవర మేర్పడెను.

"ఏమీ! నీవంత నిర్భయముగ ............" అని పలుకుచు, యాతడు కొంతతడవాగి,

"బహుశా నీవు మనవివాహ కాలమందేమి జరిగినదినీవు మరచియుండవు. నీవు నన్నాదరించుట నేను నీయమాయకత్వమునకు లోబడుట—నేనెందులకు లోబడవలసివచ్చెను? నీముగ్ధత్వము, నీమతవిషయమైక భావములు, గృహస్థధర్మముపట్ల నీకుగల అజ్ఞానత—నీవు నన్ను మూర్ఖుని గావించితివి. నిర్భయముగనీవు నాకు ద్రోహ మొనర్చితివి. ప్రపంచమందు నీ వెట్లు చూడబడెదవో నీకు తెలియునా?"

అవమానముతో నాశరీరము వణకుచుండెను. కాని నా మనస్సు మహావేగముతో కలకత్తా, ఢిల్లీ, సిమ్లా మొదలగు పట్టణములలో జరిగిన హంశములపై పరుగిడుచుండెను. తన విశృంఖలపు జీవితము తనకు దెలిసియుండియు, తానుపురుషుడగుటచే అట్లు ప్రవర్తించుటకు తగిన హక్కుగలదనియు, నేను స్త్రీనగుటచే నాకట్టి యధికారము లేదనియు, తలంచుచు నన్ను దూషించుటగని నాహృదయము రేకెత్తెను. నేనే ఒక అడుగు ముందునకువైచి "మీ ప్రలాపము లిక గట్టిపెట్టుడు. మీకు నేనే వివాహము గావింపబడుట యథార్థమే యగుగాక ఆతడే నాకునిజమగుభర్త.......... ... .... ... ...మీరు నా కెవ్వరును కారు.

ఆమాటలకు నాభర్త నివ్వెరజెంది పిమ్మట ఒక్క యెగతాళినవ్వు నవ్వెను.

"నేను నీకెవ్వరును కాను! సెహభాష్! నీవు నా కుటుంబనామమును. బిరుదులను ధరించి సమయమును వచ్చి

నప్పుడు నీయపకీర్తిని వాటిమాటున మాపుకొన దలచితివా? నీజారత్వ సంతానమును నాయింటనే బెంప సమకట్టితివా? నీకు నిజమైన భర్త మరొకడని నాముఖముపైననే జెప్పు సాహసము కూడ నీకు కలిగెనా?" అని బలుకుచు సురాపానమత్తుచే కన్ను లెఱ్ఱవడ యొడలు తెలియనికోపముతో చేయి పైకెత్తి నాదవుడపై బలముగ చరచెను. ఆదెబ్బకంటె అవమానమే నన్ను హెచ్చుగ కృంగజేసెను. నేనేడువలేదు. నాకంట తడియే లేదు. బహుశా అప్పటినుండి పెక్కుమాసముల వరకు నేను కన్నీళ్ళు విడువనే లేదు. ఆగదిమధ్య నేనట్లే నిర్జీవప్రతిమవలె నిలచియుంటిని. ఆదేసమయమందు లక్ష్మి నాగదిలోనికి ప్రవేశించెను. నాభర్త గదివిడిచి ద్వారము దాటెను. యజమాని అనియైనను లెక్కచేయక, ముఖముపై కొట్టినట్లు యాతని వెనుకనే గభాలున కవాటము మూసివచ్చి, నాప్రక్కను నిలువబడి లక్ష్మి కన్నీరును బొటబొట గార్చుచుండెను.

* * * * *

"లక్ష్మి చూచితివి కదా? నేను గృహమం దుండ తగను. సత్వరము పరిత్యజింపవలసియున్నది."

"రాణీసాహెబ్! మంచిది. అటులనే కానిండు"

"సాధ్యమైనచో ఈరాత్రియే"

"ఆభారమెల్ల నాపై విడువుము." అని పలికి లక్ష్మి వెళ్ళిపోయెను.

రాత్రి సమీపించుచుండెను. చీకటి నలుదెసల వ్యాపించుచుండెను. నాప్రయాణమునకు వలయు సన్నాహమెల్ల గావించు

కొంటిని. ఒక సాధారణ యువతివలె నావేషమును మార్చుకొంటిని. ఒక పెట్టిలో నాకుముఖ్యముగ వలయు బట్టలను మాత్రము వైచుకొంటిని, పిమ్మట నే నెచ్చట కేగవలయునో యోచింపజొచ్చితిని. నాతండ్రి గృహమందు నాకు తావు దొరుకదుకదా ? అంతకుపూర్వమే నళినరంజనుడు నన్ను కలకత్తా తోడ్కొనిపోవుటకు యంకించెను. తాను వెళ్ళునప్పుడు నళినరంజనుడు నాకొసగిన యుత్తరము, నాకెద్దియైన కష్టము వాటిల్లిన తాను తిరిగి వచ్చువరకు నాకాశ్రయ మొసగుటకై కలకత్తాలోని తన స్నేహితు లెవ్వరికైన వ్రాసియుండవచ్చు నని నాకిప్పుడు తోచెను. దూరమాలోచింపక. నేనాయుత్తరము నప్పుడే చించివైచితిని. కానింక దిక్కు లేని దీన రతినెల్ల కాపాడు ఆదీనబంధువే నన్ను కాపాడగలడు.

కలకత్తాలో తలదాచుకొన నిశ్చయించితిని. కాని ఆ పట్టణమందు నేనెట్లు నివసించవలయును ? మొదట నా తండ్రి నాకొసగిన బ్యాంకు పుస్తకమునుగూర్చి యోచించితిని. అప్పుడు రాత్రి తొమ్మిది గంటలయ్యెను. బ్యాంకునుండి అప్పుడు నాకు పైకమెట్లు వచ్చును ? అది అసంభవము. ఆ పుస్తకము నావద్దనుంచుకొని కలకత్తాలోనే పైకముతీసుకొని వచ్చో నాయునికి బయల్పడును, గనుక ఆపుస్తకము నాకెట్టి ఉపయుక్తము కానేరదు.

తరువాత నానగలను గూర్చి యోచింప దొడిగితిని. నాతండ్రియొసగిన వస్తువుల నన్నిటిని దీసుకొని, నాభర్త కలకత్తాలోను, సిమ్లాలోను తనజూడములకు వినియోగించెను.

ప్రస్తుతము నాశరీరముపైనున్న నగలు నాభర్త కుటుంబమునకు చెందియున్నవి. కాని ఆకుటుంబ నామ, బిరుదములనే విసర్జించు చున్నప్పుడు ఆనగలు నాకెందులకు ? వాటినన్నిటిని అచ్చటనే ఒకబీరువాలో బెట్టితిని. గనుక ప్రస్తుతము నాయొద్దనున్న పైకముపైననే నేనాధారపడవలసియున్నది. పెట్టెలలోను డ్రాయర్లలోను, బొట్టు పెట్టెలలోను చేతి పర్సులలోను యుంచిన పైకమునంతయును దీసితిని. ఆ మొత్తము 540 రూపాయలయ్యెను, లక్ష్మికినేను ముప్పదిరూపాయ లివ్వవలసియున్నది. ఆపైకమును వేరు చేయుగా నోట్లు, నాణెములు కలసి నావద్ద 510 రూపాయలు మాత్రమే కలవు. ఒకఅణా విలువ ఎట్టిదో నాకప్పటికి తెలియనందున ఆ మొత్తముతో నాగడువంతయు తీరుననుకొంటిని.

రాత్రి కొంతసేపటికి లక్ష్మి నాకు భోజనము తీసుకొని వచ్చి, తాను నాప్రయాణమునకు తగుసన్నాహము గావించునట్లు నాకెరిగించుచు నన్ను తొందరబెట్టెను. నాభర్త లలిత పరివారముతో వేటకై అప్పుడే రెండుమోటారులపై వెళ్ళినట్లును, నాలుగైదు దినములవరకు వారు తిరిగి రానట్లును చెప్పెను. భవనమందు మాతోటమాలి కృష్ణదాసు, మరిఒకరిద్దరు పరిచారకులు తక్క మరెవ్వరును లేరు.

పన్నెండుగంటలయ్యెను. భవనములోని పరిచారకులు గాఢనిద్రా పరవశులై యుండిరి. లక్ష్మి నాగదిలోనికివచ్చి అంతయు సంసిద్ధముగ నున్నదని, నాకు తెలుపుచు పెట్టెతనతలపై నిడుకొని దక్షిణద్వారముగుండా క్రిందికి దిగెను. నేను మారు

మాటాడకయే ఆమెననుసరించితిని. రమాభవనము యొక్క ప్రాకారమును దాటి రోడ్డుపైకి వచ్చితిమి. కృష్ణదాసు తన తోటపనులకై యుపయోగించుచున్న ఎద్దుబండిని నాకొరకై సిద్ధముగ యుంచెను. మేము బండి నెక్కగనే వెనుకకైనను జూడక కృష్ణదాసు బండి త్వరితగతిని పోనిచ్చెను.

మేము స్టేషను జేరితిమి లక్ష్మి యుంమకబోము టికెట్టుకొని బండివద్దకువచ్చి, పెట్టె తనతలపై నిడుకొని రైలు బండివద్దకు దారి తీసెను. నేను ఐదురూపాయలు మాత్రము కృష్ణదాసు చేతిలోనిడి లక్ష్మిని వెంబడించితిని. లక్ష్మి నన్ను మూడవ తరగతి స్త్రీల పెట్టెలో నెక్కించెను. అందు ముగ్గురు స్త్రీలు మాత్రమే కలరు. రైలుబండి కదలెను. లక్ష్మి నాకు నమస్కరించి, పొంగివచ్చు తన దుఃఖమును దిగమ్రింగి నెమ్మదిగ "అమ్మా! మీకు జయమగుగాక—భగవంతుడు నాకు తిరిగి మీపరిచర్యలుచేయు భాగ్యము ప్రసాదింపగలడు. అని బల్కెను.

ధూమశకటము మతిరయమున బోవుచుండెను. తెల్లవారెను. బండి ప్రతిస్టేషనులోను ఆగుచుండెను. బండిలోనెక్కువారిని దిగువారినిజూచుచు, అందెవ్వరైన నన్నుజూచి గుర్తించెదరని భీతిల్లుచు కాలయాపన జేయుచుంటిని. కలకత్తాలో దిగి నేనెచ్చట తలదాచుకొనవలెనో; నేనెట్లు ప్రవర్తింపవలెనో యోజించుకొనుచుంటిని కాని పర్యవసాన మెద్దియు నాకు తోచుటలేదు.

## అధ్యాయం ౯

సాయంకాలము ఏడుగంటలకు బండి కలకత్తా చేరెను. హోటలు ఏజంట్లు ప్రయాణీకులను కలిసికొని వారిని తమ వెంటదీసుకొని వెళ్ళుచుండిరి. నన్నొక స్త్రీ కలుసుకొని తాను వంగవనితా వసతిభవనమునకు ఏజంటుననియు, అందు నాకు తగు వసతి నేర్పరచెదననియు, నాతో నచ్చుబలికినన్ను తన వెంట బండిపై గొనిపోయెను. హోటలు చిట్టాయందు నాపేరు "సరోజని" అని వ్రాసియుంటిని.

రెండుదినములు గడచెను. ఆవసతి గృహామందెవ్వరి తోడను నేను విశేషించి మాటాడలేదు. గృహాధికారిని ప్రశ్నింపగ ఆమెతో మాత్రము నాభర్త డాక్టరనియు, అతను దేశాటన ముగించుకొని కొన్నిదినములలో కలకత్తా రానైయున్నందున యాతని కలసికొనుటకై నేనచ్చటకు ముందుగ వచ్చితిననియు, తెలిపియుంటిని.

ఇట్లుండ ఆమరునాడు నేను మేడమెట్లు దిగుచుండ ఆఫీసుగదిలో వేరొక స్త్రీ గృహాధికారినియొద్ద వార్తాపత్రికబిగ్గరగ చదివి వినుపించుచుండెను.

"కాళిగంజి జమిందారు రాజాప్రఫుల్లచంద్ర ఛటర్జి భార్య రాణీశశిరేఖాదేవి శుక్రవారం ఉదయమునుండి కానబ

డుటలేదు. బహుశా లక్ష్మీవారం రాత్రికాలమందే ఈఉపద్రవము జరిగియుండెనని తలంచుచుండిరి.

ఆమె దేశోద్ధారక రమేశ చంద్రబాబుయొక్క కుమార్తె రాజాప్రఫుల్లచంద్రుని గతసంవత్సరమే వివాహమాడెను.

రాణీ సాహెబ్! తరచు తమభవనమునకు సమీపమునసేయున్న కొలనువద్దకు సాయంకాలమునందు విశ్రాంతిదీసుకొనుటకలదు. విశ్రాంతి దీసుకొని గట్టుపైనుండి తిరిగి వచ్చుచుండ ప్రమాదవశమున చీకటిలో కాలుజారి నీటిలోబడియుండవచ్చునని నమ్మియామె కళేబరమునకై వెతుకు చుండిరి. "రమాభవనమునందెల్లరు కలవరపడుచుండిరి. పట్టణ మంతయు ఆశ్చర్యసంభ్రమములతో నిండియుండెను.

రాజాసాహెబ్ నకు వారికుటుంబమునకు మా సాను భూతిని దెల్పుచుంటిమి.

ఆవార్త వినినపిమ్మట నాగదిలోనికి నేను నెమ్మదిగ జారి పోతిని.

వార్తాపత్రికలందట్లు వ్రాసియున్ననూ, నేను పలాయనమైనటులే కాళీగంజియందు చాలమందినమ్మియుండిరి. అందులకై కొన్ని నిదర్శనములు కలవు. ఒక వారము దినముల పిమ్మట వార్తాపత్రికలలో తిరిగి ఒకప్రచురణము గానవచ్చెను.

"గొప్ప బహుమానము—— ఇరువది సంవత్సరములు సామాన్యమైన పొడవు, వచ్చని శరీరఛాయ. నల్లనిపొడుగైన తల, చక్కటి లూపురేఖలుగలయువతి కానబడుటలేదు. ఆమె జాడలు తెలిపినవారికి రు. 5000 బహుమానము.

"బాబూ రమేశచంద్రదత్తు, కాళీగంజి" అదిమూదినం తనే నాహృదయమెంత యాందోళనచెందెనో నేనప్పుడు చెప్ప జాలను. ఆవసతి గృహమందలి స్త్రీలే నా ప్రవర్తనలెల్ల కనిపె ట్టుచున్నట్లు, నారహస్యములెల్ల పరచిత్తాధీనమైనట్లు నాకుపొడ కట్టుచుండెను. యీవసతిగృహమందే గాక కలకత్తాఅంతయు నాపరాయనమును గూర్చి ముచ్చటించుచున్నట్లు నా అంతరా త్మయే నాకు దెలుపుచుండెను. కాని వసతిగృహాధి కారిని మా త్రమునన్ను మిక్కిలిగ యనుమానించుచుండెను. తనకుసమయ ముచిక్కినప్పుడెల్ల ఒకప్రక్కగ నిలుచుని నావైపు రెప్ప వేయక జూచుచుండెడిది. తనకు తీరికయైనప్పుడు ఒక్కొక్కమారు నాగదిలోనికెద్దియైన పనిగల్పించుకొని వచ్చి నాతో ఒకటి రెండు మాటలాడి పోవుచుండెడిది. అదేమో కాని ఆమె నాతం డ్రితో ఉత్తరప్రత్యుత్తరములు సలుపుచున్నట్లు నా అమాయిక హృదయమునకు తట్టెను. ఆది మొదలు నేను వెలుపలికి బోవుట తగ్గించి, నాఆరోగ్యము బాగుగ లేదనే మిష బెట్టి గదియందే కాలము వెలిబుచ్చుచుంటిని.

ఒకనాటి ఉదయము గృహాధికారిని నా గదితలుపులు దట్టుచు "సరోజనీదేవి" యనిపిలచెను, నేను వెళ్ళితలుపు తీయగనే,

"మిమ్ము జూచుటకై ఏవరో స్త్రీ ఒక పెద్దమనుష్యుని వెంటబెట్టుకొని వచ్చియుండెను. వారిరువురు నా ఆఫీసుగదిలో కూర్చొనియుండిరి. ఆమె యొంటరిగపైకివచ్చి మిమ్ముజూడ

గోరుచుండెను. నేనామెనిచ్చుటకు బంపవచ్చునా? అనియడిగెను. కాని అట్టిసమయమందామెకు, ఎట్టిఅనుమానము త్రోపజేయుట కిష్టములేనందున, నేనందులకు సమ్మతింప వలసివచ్చెను. కొన్ని నిమిషములలో ఒక విచిత్రంసఘటన జరిగెను.

నేను నా గదిలో కిటికీవద్దనిలుచుని యుంటిని, గృహాధికారిని వెళ్ళినపిదప ఒకస్త్రీ నాగదిలో ప్రవేశించి తలుపు నిప్పటివలె మూసివైచెను. ఆ శాంతిగుణోపేత యెవ్వరో నాకు తెలియదు.

ఆమె నాయెద్దుట బడినంతనే నాలోఅనుమాన తరంగమొక్కటి వెల్లువిరచెను. అదేసమయమున ఆహ్లాదముగూడ నన్నావరించెను. ఆవ్యక్తి యిందిరాదేవి.

* * * * *

ఇందిరాదేవి నాప్రక్కనే వేరొక కుర్చీలో కూర్చొని తన దక్షిణహస్తముతో నాతల నిమురుచు, "శశిరేఖాదేవి నీవు భయపడవలదు. నాకు నీయుదంత మంతయు యెరింగింపుము, నీవు చాల నెమ్మదిగ మాట్లాడవలయును." అని కరుణారసమొలుకునట్లు నాతో బలికెను. నేను నాపరిస్థితులెల్ల ఆమెకు క్లుప్తముగ నెరింగించి నాభర్త గృహమందు నాకుచాల కష్టముగ యున్నందున, నేనచ్చటినుండి పరాయునమై వచ్చితిననియు, నాకిష్టము లేకపోయినను నాతండ్రి దన్నాతనికిచ్చి వివాహ మొనర్చెననియు, నాతండ్రినియెదిరించుట కప్పుడు

అశక్తునైతిననియు, నాభర్త నన్ను ప్రేమింపక పోవుటయే గాక వేరొకతెను ప్రేమించి నాకన్నులయెదుటనే తనదుష్కృత్యముల నెల్ల ప్రదర్శించుచు నన్నుపలుయిడుములఁ గుడుపుచు నన్ను అవమానపరచుచున్నందున నేనట్లు గావింప వలసి వచ్చినదనియు, ఏదియెట్లు జరిగినను నేను నాభర్తపొందు గోరననియు ఆమెకు నివేదించితిని. నన్ను నాభర్తకు దూరము గావించిన వనిత లలిత యని బలుకగనే ఇందిరాదేవి చాల ఆశ్చర్యమును జెందెను. ఆమె నా పలుకుల శ్రద్ధతో విని,

“ శశిరేఖా ! నీకై మీబంధు మిత్రులు చాలపరితపించుచున్నట్లును, నీమనో చాంచల్యత వలన నీవిట్లొనర్చితివనియు నిన్నెట్లయిన తిరిగి కాళీగంజికి బంపుమనియు నన్ను గోరియుండిరి. అనిపలికెను.

“ ఇందిరాదేవి ! ఇది అసత్యము. మీరది యెంత మాత్రము నమ్మవలదు, ” అని నేనామెతో జెప్పితిని. పిమ్మట ఇందిరాదేవి అతి నెమ్మదిగ తానెట్లు అచ్చటికి వచ్చినది నా కెరింగించెను. ఇందిరాదేవి కలకత్తాలోనే యున్నసంగతి దెలిసి శాస్త్రీజీ ఆమెకొక లేఖ వ్రాసెను. వకీలు నా తండ్రి లేఖ నందుకొని, ఇందిరాదేవిని తోడ్కొని వసతిగృహమునకు వచ్చి క్రింద వేచియుండెను. ఆ సంగతులన్నియు విని ఎట్లయిన, నన్ను గాపాడుమని ఇందిరాదేవిని ప్రాధేయపడితిని. నా తండ్రివచ్చి నన్ను కాశీ మహిళా విద్యాలయమునుండి అప్పుడు దీసుకొని పోకయున్న తనవలెనే నేనును దేశ మత ధర్మములను నా జీవిత

మున దత్తత గావించుకొని యుండెడిదానను. విద్యాలయమందు నాపై నెట్టి కృపారసమును జూపెనో యట్లే నాపై కృపగొని నన్ను గాపాడుమని యామెను దీనవదననై కోరితిని. ఇందిరాదేవి అశ్రుకణపూరితయై "అమ్మా! శశిరేఖా! నిన్ను జూచిన, నీయుదంతమును వినిన నాహృదయము నీరగుచుండెను. నేను నిన్నెట్లు గాపాడవలెనో నాకు తెలియుటలేదు. నా గురుదేవి పాదసన్నిధిని సత్యవ్రత దీక్షనైతిని, నేనిప్పుడెట్లు అసత్యమును పలుకగలను? పూజ్యులగు గంగాధర శాస్త్రీజీకి నేనెట్లు సత్యవిరోధమైన లేఖను వ్రాయుదును?" అని దురపిల్లెను. నే నప్పుడు,

"ఇందిరాదేవి! నన్ను క్షమింపుడు, భగవంతుడే మనకీ సంఘటన కలుగజేసెను. మీమనస్సున కేది యుత్తమమో యట్లె యొనరింపుడు. కాని మీరు నా శ్రేయస్సునకు వ్యతిరిక్త మొనర్పరని నాకు బాగుగ తెలియును. భగవంతునకు గూడ యాసంగతి తెలియును. మరియు నా కెద్దియేని అవమానము జరిగిన ... ... ..." అని యెద్దియో జెప్పబోవుచుంటిని. నా గొంతుక ఎండిపోయెను. నేను ఇందిరాదేవిని యెడిలో ముఖమును జారవిడిచితిని. కొంతసేపటి వరకు ఆగది నిశ్శబ్దముగ యుండెను.

అంతలో మెట్లపైనుండి కాలిచప్పుడు వినవచ్చెను "శశిరేఖా! లెమ్మా. వారువచ్చుచుండిరి. నీవేమియును బలుకవలదు. ఆ భారమెల్ల నాపై విడువుము. నేను మరొక పర్యా

యము వచ్చి నిన్ను కలసికొనెదను." అని చెప్పుచు ఇందిరా దేవి ద్వారమువద్దకు జనెను. అంతలో వకీలును తీసుకొని గృహాధికారిని నాగది యెదుటకువచ్చి నిలిచెను. వకీలు తన దృష్టి నాపై బరపెను. కాని ఇందిరాదేవి యాతనిని వారించి, "మన కిచ్చట పని యెద్దియును లేదు" అని జెప్పుచు క్రిందికి దిగెను. వారు ఆమె ననుసరించిరి.

* * * *

ఎందు వలననో కాని, తరువాత నాతండ్రి నన్నన్వేషించుట మానుకొనెను. ఇట్లు ఆరు వారములు గడచెను. దసరా సమీపించెను ఆ మహానగర మందు వీధులు, గృహములు చక్కగ నలంకరింపబడియుండెను. ఆ మహాకాళిని పూజించి ఆనందించుచు భాగ్యము నాకప్పుడు కలుగ లేదని నేను చాల చింతించితిని.

మా వసతి గృహమునకు సమీపముననే యున్న ఆలయమందు దేవీ మహోత్సవమును జూచి, ఒక సాయంకాలము నా బసకు తిరిగి వచ్చుచుంటిని. వార్తాపత్రికలమ్ము బాలురు "హిమాలయ శిఖరారోహకుల మరణము" అని బిగ్గరగ యరచుచు పత్రికల నమ్ముచుండిరి. ఆమాట నా చెవియందు ఒక పిడుగువలె పడెను. నేను చటాలున ఆ స్థలమునందాగిపోతిని. ఆ బాలుని చేతియందలి పెద్ద యక్షరములతో ముద్రింపబడియున్న కాగితమును జూచితిని. నాలో వర్ణింపనలవి

కాని భయముజనించెను. చైతన్యవిహీనతై నేనటులే నిలిచి యుంటిని. ఆ బాలుని చూచి, చాలమంది పత్రికలను గొనుచుండిరి. నేను కూడ ఒక పత్రికను గొనుటకు ప్రయత్నించితిని. కానినానోటిమాట చాల నీరసించెను. ఆ బాలుడు నా మాట వినుపించుకొనకయే కేకలిడుచు ఆ స్థలమును విడిచి వరుగెత్తెను. తరువాత నేనా పత్రికనుగొని ఆ ధారుణమును చదువ సాహసించలేక పోతిని. నేను నెమ్మదిగ అడుగులిడుచు, నా బసకు వెళ్ళుచుంటిని. "హిమాలయ శిఖరారోహకుల మరణము" అను కేకలతో ఆ పత్రికలమ్ము బాలురు నన్ను తరుముచున్నట్లు ఆ కఠోరశబ్దము నా వీనులందు ప్రతిధ్వనించుచుండెను.

నేను నాగదిలోనికిబోయి ఒక కుర్చీలోకూలబడితిని. యోచనాశూన్యనై నేనెంతకాలముపడివుంటినో నేనూహింపజాలను. తరువాత నా ప్రక్కగదిలో ఎవరో బిగ్గరగ వార్తా పత్రికను జదువుచుండిరి. నేను శ్రద్ధగ అదివినప్రయత్నించితిని.

"ఈసంవత్సరారంభమందు డాక్టరు నళినరంజన్ ఛటర్జీ యాజమాన్యమున హిమాలయ శిఖరారోహణమునకై బయలుదేరిన యాత్రికులు ప్రమాదమునకు జిక్కినట్లు తెలియవచ్చెను,

యాత్రికులు నంగ ప్రభాత్ శిఖరము నెక్కుచు సురక్షితముగ ఐదవ మజిలీనుండి నిస్తంతులముద్వారా గతవారమే వార్తను బంపియుండిరి. కాని ఈ ఉదయము సిమ్లానుండివచ్చిన తంతివార్తయందు యాత్రికులలో పెక్కుమంది మడసి నట్లు

తెలియవచ్చెను. డాక్టరు నళినరంజన్ ఛటర్జీకూడ మరణించి నటులే తెలియుచుండెను.

ప్రభుత్వమువారు సత్యాన్వేషణమును జేయుచుండిరి. ఆమెయింకను నిద్దిరయో జరుపుచుండెను. కాని, నేను విన లేకపోతిని.

నా బాల్యము, నా విద్య, నా వివాహము, నా ప్రేమ గాధ పునరీక్షణ గావించుకొంటిని. నేను ప్రాణములతో యుండిన నా నళినరంజనుడు నన్ను కలసికొనును. నా జీవితమును రంజింపజేయును. కాని యిప్పుడు నా కట్టియాశ లేదు. ఆతని ఆత్మ మాత్రము నాలో సమాధికట్టుకొని యుండును. నేనింక ఎందులకు జీవింపవలెను ? ఇట్టి విషమస్థితిలో జిక్కి నా భవితవ్యమును చర్చించితిని. నా మనస్సు పరిపరివిధముల బోయెను.

అనుదినము నా గర్భమందలి, శిశువునుగూర్చి యే దలంచుచు ముచ్చట బడుచుండెడి దానను. నాభవిష్యజ్జీవితాలోచనలు నన్ను ఉపశయనము జేయుచుండెను. రహస్యాహ్లాదము నాలో జనించెను. నా గర్భమునందలి శిశువు కుమార్తె యని తలంచుచుంటిని. ఆమె చక్కటి వదనము నా కన్నుల యెదుట మెలగుచుండెను. ఆమెను నే నెట్లు లాలింపవలయునో, ఆమె కెట్లు యాటపాటలు నేర్పవలయునో ! ఆమె కెట్లు విద్యాబుద్ధులలవడ జేయవలనో, ఆమె పెద్దదైన పిదప తల్లి[illegible]

గూర్చినయుదంత మామె కెట్లు తెలియజెప్ప వలెనో వింత వింత భావాభిప్రాయములు నాకు గలిగెడివి.

*  *  *  *  *

మూడుమాసములు గడచెను. అప్పుడే నా పైకములో నాల్గవభాగము ఖర్చుబడెను. నేనింకనూ ఆ వసతిగృహమందే యుండిన చిక్కుపడ వలసియుండును. నా ప్రసవానంతరము వరకు ఆ పైకముతోనే నేను జీవింపవలసియుండును.

అది మార్గశిరమాసము గురువారము. రాత్రి చలి మిక్కుటముగ యుండెను. మంచు దట్టముగ పడుచుండెను. నేను మంచముపై పరుండియుంటిని. నా సమీపముననే మంత్రసాని నిలుచుని యుండెను. నాకు అప్పుడప్పుడు నిస్పృహాజనించుచుండెను. బాగుగ స్పృహ కలిగినపిమ్మట నా యెదుట లేడీ డాక్టరు, మంత్రసాని, మా యజమానురాలు నా గదిలో యున్నట్లు నాకు స్ఫురించెను. వారు నా స్థితినిజూచి చాల భీతిల్లుచుండిరి, నేను జీవించెదననెడి యాశ వారికప్పుడు లేదు. కాని నేను కన్నులు తెరిచినంతనే వారికి కొంత ధైర్యము కలిగెను. నా నోటినుండి "దైవమా! నాబిడ్డ పుట్టుకతోనే చచ్చునట్లు జేయుము" అనెడి పలుకులు వెలువడెను. ఆ రాత్రంతయు చాలకష్టముగ గడచెను. "నళినరంజన్! నా నళినరంజనుడేడీ!" యని నేను పలవరించుట నా చెవులకే వినిపించెను. యాతడు మరణించినన్న సంగతి జ్ఞాపకమునకు వచ్చినంతనే

భగవంతుని ప్రార్థింపజొచ్చితిని. "దైవమా! నాబిడ్డపుట్టుక ......... " అని పలుకుచుండ ఎవ్వియో మాటలు ఆటంకము కలుగజేసెను. అంతలో శాంతి చేకూరెను. నేను తుఫాను మధ్యనుంచి నిర్మల ప్రదేశమును పడితిని. స్వర్గతుల్యమైన నిశ్చలత చేకూరెను. ఆ గదిలోని వారెద్దియో సంతోషముతో చెప్పుకొనుచుండిరి.

"పిల్ల చనిపోయెనా?" అని నేను అడిగియుంటిని.

"చనిపోవుటయా! పరమేశ్వరుడు రక్షించుగాక — నీబిడ్డ సజీవియై సురక్షితముగ యుండెను. — చక్కటి బాలిక" అని మంత్రసాని పలికెను. ఆ పలుకులు వినినంతనే నాకు చాల సంతృప్తికలిగెను. కాని యింకనూ నా పిచ్చియూహాలు నన్ను విడబాయలేదు. ఒక నిట్టూర్పు విడిచి గోడవైపునకు తిరిగితిని. అంతలో నిద్రనన్నావహించెను. మెలకువ వచ్చుసరికి నాలో చాల నిర్మలత్వ మూదయించెను. నాబిడ్డఏడ్పు నా చెవులకువినుపించుచుండెను. ప్రక్కకుతిరిగి చూడగనే మంత్రసానియొడిలో నా బిడ్డయుండెను. నాకు శక్తి యెట్లుకలిగెనో చెప్పజాలను. మంత్రసాని వలదని వారించుచున్నను వినక గభాలున లేచి నా బిడ్డను నాకిమ్మని కోరితిని.

"ఇప్పుడు వలదు మరికొంతసేపు పోనిండు." అని మంత్రసాని పలికెను. "నేను తాళలేను నాబిడ్డను ఇప్పుడే నాకిమ్ము."

"అమ్మా ముందుగమీరు కొంత ఆహారమును దీసుకొనవలెను. అనిచెప్పి ఒకగ్లాసుతో కొన్నిపాలను నాకిచ్చెను.

అది త్రాగినపిమ్మట నా చేతులను చాచి నా బిడ్డనందుకొంటిని. ఆహా! ఆ సమయమున నే నెట్టి యానందము ననుభవించితినో మీకు చెప్పనలవి కాదు. ఆ పసికూన మోమునందు నారూపురేఖలు గాన వచ్చుచుండెను. కాని నేత్రములు మాత్రము నిక్కముగ నళినరంజనునివే! అట్టినా ప్రేమరత్నమునకు ముద్దులొసగుచు కొంతతడవానంద సాగరమందుంటిని.

పిమ్మట నా నళినరంజనుని తలచుకొని వంతనే దుఃఖము పొంగివచ్చెను. నాబిడ్డ నిద్రించుచుండెను. దానిమోమును గాంచి ఆ పరమాత్మునకు ధన్యవాదము లర్పించితిని. నాదుఃఖోపశమనమునకై యాతడీ ముక్తాఫలమును నా కొసంగెను.

* * * * *

నాబిడ్డజన్మించి నెలదినములు గడచెను. నేను వేకువజామున నే నిద్రనుండి మేల్కాంచుచుంటిని. అందువలన నాకెట్టికష్టము కలుగలేదు. నీళ్ళుపోయుట, బట్టలుతొడిగి ముస్తాబు చేయుట పాలొసగుట నాకు నిరంతరమైన ఆనందమును కలుగజేసెను. పదహారు సంవత్సరములకు పూర్వము నా జీవితాంశమును దిప్పిననేను తిరిగి నా తల్లిగదియందు బొమ్మతో నాడుకొనుచుంటిని. ఆహా! ఘటనాచక్ర మెట్లు తిరుగుచుండును? నేనెంతయో ధన్యురాలను. ఏభాగ్యశాలి యైనను నావలె సుఖమును బడయజాలదు. దినమంతయు పాటలతోనే గడుపుచుంటిని. బాల్యమందు నేనుపాడిన పాటలెల్ల నాకంఠమునుండి

వెలువడుచుండెను. నాబిడ్డకు "విద్యాపరి" అని నామకరణ మిడితిని. కాని నేనట్లు చేయగలనా! మాగృహ యజమానురాలు మంత్రసాని సలహా ననుసరించి ప్రవర్తించమని నన్ను మందలించెను. అట్లుగావించమని నా అంతరాత్మ నాకు బోధించుచుండెను. అప్పుడు నాయొద్ద పైకము ఏబదిరూపాయలకు మించి లేదు. నేనెద్దియేని వ్యాపకములు కలిగించుకొనినిగాని నా జీవితము గడచునదెట్లు? నా విద్యను పెంచి పెద్దచేయుటెట్లు? గనుక ఆమెను ఏదాదకైనను అప్పగించి నేనెక్కడనైనను పని జూచుకొనవలయును. అందుచే నా విద్యకు పాలొసగుట మాని ఆవుపాలను గాజుబుడ్డిలోపోసి పట్టుచుంటిని.

కలకత్తాలో కొన్ని శిశుసంరక్షణాలయములు కలవు. నెలకు కొంతపైకము కట్టినచో శిశువులను శ్రద్ధగ బెంచుదురని నాకు తెలియవచ్చెను. అట్టి శిశు సంరక్షణాలయముయొక్క చిరునామా మాగృహ యజమానురాలు నా కొసగెను. నేను ఉత్తరమును వ్రాయగా విద్యను తమ సంరక్షణాలయములో చేర్చుకొనెదమని నాకు దెలిపియుండిరి. కాని నా ప్రాణ ప్రియను, నేనెట్లు విడిచి యుండగలను? నేనెందైనపని జేయుచు అనుదినము చూచి పోవుచుండ వచ్చునని మనస్సును పదిలపరచుకొని, విద్యను శిశు సంరక్షణాలయములో వదలుటకు నిశ్చయించుకొంటిని. నిక్కముగ నా మాతృ ప్రేమను అరికట్టు కొంటిని. ఇంటిబాడుగ మొదలగునవి పోను, నావద్ద అప్పుడు ఇరువదిఏడు రూపాయలు మాత్రమే యుండెను. ఆ రాత్రివిద్యయొక్క బట్ట

లన్నియు చిన్న మూటగట్టి ఉదయము కలకత్తా వెళ్ళి దానిని సంరక్షణాలయమునకు అప్పజెప్పుటకై సంసిద్ధనై యుంటిని.

మరునాడుదయము ఏడున్నర గంటలకు పట్టణము లోనికి బయలుదేరితిని. శిశు సంరక్షణాలయము పార్కు-సర్కస్ లోయుండెను. రామరాజతలాబ్ నుండి పార్కు-సర్కసునకు సుమారు పదిమైళ్ళుండును. ఒక అర్ధరూపాయి కర్చుబెట్టిన బస్సుపైనను, ట్రాంకారుపైనను, సునాయాసముగ ఆ స్థలమును చేరగలను. కాని నావద్దపైకము చాల తక్కువగ యున్నందున అర్ధరూపాయయైనను కర్చుబెట్టుట నాకిష్టములేదు. కనక నడచివెళ్ళుటకే మనస్కరించుకొంటిని. మా దాసిపిల్ల విద్య నెత్తుకొని హౌరా రోడ్డువరకు సుమారు ఒకమైలు దూరమువరకు వచ్చెను. పిమ్మట విద్యను నాకొసగి, కలకత్తా వెళ్ళుటకు నాకు సరియైన మార్గమును జెప్పి తాను తిరిగి వెళ్ళిపోయెను.

ఆ ఉదయము చాల ప్రశాంతముగ యుండెను. దినకరుడు చిరుమేఘములచే కప్పబడియుండెను. చక్కని గాలి మేను వకు హాయి గొల్పుచుండెను. బాటకు ఒకవైపున చురుకుగ నడిచి పోవుచుంటిని. ఒక సంచికలో విద్యయొక్క బట్టలు పాల బుడ్డి నా వామ చేతికి నిడుకొని యుంటిని. రెండవ చేతియందు విద్యయుండెను. మొదట నాకంతకష్టము కలుగలేదు. రోడ్డు కిరుప్రక్కలనున్న దుకాణములను జూచుచు పదకొండు గంట లగుసరికి హౌరా చేరితిని. ఆ బాట చాల పొడవుగ యుండెను. ఎంతదూరము నడచినను అంతుకాన వచ్చుటలేదు. వంతెన

దాటి కలకత్తా చేరుట కింకనూ చాల దవ్వు యేగవలసి యుండెను. కాని యింకనూ నాకంత ఆయాసము కలుగలేదు. హౌరా పురపాలక భవనము సమీపమునకు వచ్చుసరికి విద్య పాలకై ఏడ్చుచుండెను. అప్పుడు నేను సమీపముననే యున్న పార్కునిలోకేగి, ఒక బల్లపై చిట్టుసీసను కూర్చొని పాలబుడ్డి ఆమె నోటియందిడితిని. సూర్యుఁ పైకి వచ్చుచున్న కొలది ఎండతీక్ష్ణమగుచుండెను. ఆ పార్కునందే కొంతసేపు కూర్చొనవలెనని నాకు తోచెను. కాని యింకనూ నేను చాలా దూరము పోవలసియుండెను.

వంతెనదాటి హేరిసన్ రోడ్డు చేరునప్పటికి నాకు ఆలసట కలుగుచుండెను. కాని మనుష్యులను తప్పించుకొనుచు కాలిబాటపై పోవుచునే యుంటిని. సెంట్రల్ ఎవెన్యూవద్ద ఒక హాస్పటల్ నర్సు నా భుజముపైనున్న విద్యను జూచి యుప్పొంగుచు, నా యనుమతిపై దానిని ఎత్తుకొని ముద్దిడుచు సియెల్డా స్టేషను సమీపమువరకు వచ్చెను. పిమ్మట విద్యను నా కొసగి పార్కుసర్కసుకుబోవు దారిని నాకు తెలిపి వేరొక తావునకు బోయెను. మరికొంతదూరము నేను నడవగలిగితిని. చేతిలోసంచి, భుజముపై బిడ్డ నాకంతకంతకు చాల భారము కలుగ జేయుచుండెను. అప్పుడే రెండుగంటలయ్యెను. నాకు ఆకలి మిక్కుటముగ యుండెను. ఆ సమీపమున చాల హోటలులు గలవు అందు శుభ్రముగ కానబడుచున్న హోటలు లోనికి ప్రవేశించితిని. అందు స్త్రీలే వలయు పదార్థములను

దెచ్చి యిచ్చుచుండిరి. నేను లోనికి వెళ్ళగనే సన్యాసినీ స్త్రీ చిన్న గదిలోనికి ప్రవేశపెట్టి ఎలెక్ట్రిక్ పంకానువదలెను. దానివలన నా ప్రాణమున కెంతో సౌఖ్యమొసవెను. నేను గొంత అల్పా హారమును దీసుకొని, తరువాత గిన్నెడు తేనీటిని త్రాగి తిని. విద్యకొరకై ఆవుపాలును తెప్పించి పాలబుడ్డిలో పోసి, అచ్చటనే కొంతదానికి పట్టితిని.

హోటలునందు కొంత విశ్రాంతిని దీసుకొని తిరిగి నడక ప్రారంభించితిని. వెళ్ళినకొలది నాకు బడలిక హెచ్చు చుండెను. అడుగుతీసి అడుగువేయుటయే చాల కష్టముగ యుం డెను. నా బిడ్డనింత దూరములో విడచు చున్నందులకు ఆత్మదూ షణ గావించుకొంటిని. ఒకరిద్దరి నడిగి తెలిసికొని తుదకు గమ్య స్థానము చేరునప్పటికి నాలుగు గంటలయ్యెను.

ఆగృహ ద్వారమువద్ద "హిందూశిశు సంరక్షణాల యము" అను విలాసము వ్రాయబడి యుండెను. నేను లోనికి ప్రవేశించితిని. సుమారు ముప్పది సంవత్సరముల యువతి చిరు నవ్వుతో నన్నాహ్వానించుచు "మీకొరకై ఉదయము నుండియు నిరీక్షించుచుంటిమి" అని పలికి నన్నొకకుర్చీపై కూర్చుండజేసెను. ఆమెపేరు అరుంధతి. ఆగృహము చాలసు భ్రముగ నుంచబడెను. అందలి గృహోపకరణములు తీర్చి చక్కగ అమర్చబడియుండెను. ఆ గృహమందే వేరొక స్త్రీ కూడ కలదు. ఈ స్త్రీ లిద్దరు కలిసి ఆ సంరక్షణాలయమును స్థాపించిరి. అందిప్పుడు ఎనమండ్రుగురు శిశువులు గలరు. వారు

విద్యను దీసుకొని దాని చక్కదనమునకు మిక్కిలిగొనియా
డుచు కొన్ని వివరములనుగూడ నన్నడిగి దెలుసుకొనిరి. పిమ్మట
సంవత్సరము వయస్సు మించిన బిడ్డలకు నెలకు పన్నెండు రూపా
యిలు తాముదీసుకొందుమని నాకు చెప్పిరి. ఒక నెలసొమ్ము
ముందుగనే ఇచ్చి వారమునకు మూడురూపాయలచొప్పున
ఇచ్చుచుండ వలయును. అది వారి సంరక్షణాలయము యొక్క
నిబంధనమనియు నాకు దెలిపిరి.

నే నానిబంధనల కియ్యకొని పన్నెండు రూపాయలు నా
సంచిలోనుంచిదీసి వారికిచ్చితి. వారిని జూచినంతనే వారు
మంచిస్వభావము కలవారనియు, దయార్ద్రహృదయులై నా
విద్యను పెంచెదరనియు నేనుదృఢముగ నమ్మియుంటిని. కొంత
సేపైనతరువాత నాకొకగిన్నిలో తేనీరు తీసుకొని రాబడెను.
అప్పుడే ఐదుగంటలయెను. నేను తిరిగి చాలాదూరము వెళ్ళ
వలసియుండెను. కాని నా బిడ్డను వదలివెళ్ళుట యెట్లు? నేను
దానిని ఒక పక్కపై పరుండబెట్టి నిద్రబుచ్చితిని. తరువాత
నేను విద్యకై కుట్టితెచ్చిన దుస్తులను అరుంధతీ దేవి కిచ్చితిని.
వాటిని జూచి, ఆమె నన్ను చాల మెచ్చుకొనెను. కుట్టుయం
దునాకు చాల నేర్పరితనము కలదనివలికెను.

నేను వెళ్ళుటకు లేచితిని. సంరక్షణాలయమందు నాబిడ
సుఖించునని నాకు దెలిసియున్నను దానిచ్చుట విడిచి వెళ్ళుటకు
నా హృదయము రాచి పెట్టుచుండెను. నేను వేరుమాటాడక
నా బిడ్డను జాగరూకతతో జూచుభారము నీదిసుమా ! అను

భావముతో దీనవదననై అరుంధతివంక జూచి వెనుకకైనను దిరుగక ఆ స్థలమునువీడి వడిగ నడచిపోయితిని.

నానేత్రములు భాష్పములతో నిండియుండెను. నాకు బాటయే సరిగ కానవచ్చుటలేదు. నా పవిటతో కన్నులను తుడుచుకొని, తలపై ముసుగు సవరించుకొని నేను వచ్చిన బాట వెంబడి త్వరిత గతిని బోవుచుంటిని. నేనట్లు చాలదూర మేగియుంటిని. కారణము లేకయే నేనట్లు యేడ్చు చున్నందులకు కొంతసేపటికిసిగ్గుపడితిని. నా బిడ్డను సంరక్షణాలయ మందు విడిచిన, అది దాని బాగు కొరకే — ఒక నెలకు సరిపోవు వైక్క ము ముందుగనే యిచ్చియుంటిని. ఇప్పుడు నా పనికై నేను పాటు బడవలసియుండెను. నే నేపనిని చేయుగలను? వ్రాతపని ఎద్ది యైన నేను బాగుగ చేయుగలను. నాకు వంగభాష,సంస్కృతము హిందూస్థానీ బాగుగ తెలియును. అంత పాండిత్యము లేకపో యినను యింగ్లీషుకూడ నాకు బాగుగవచ్చును. గ్రంధ ప్రకా శకులు ఇన్నిభాషలు వచ్చినవారిచే పుస్తకములు ఆ యాభాష లలోనికి తర్జుమా చేయించి వారిని తగురీతిని ఆదరించుచుందు రని అంతకు పూర్వమే వినియుంటిని ఆ పనికూడ నేను చేయు గలను. నా బిడ్డకు నాకు జీవనాధారము కావలెను. నగరపరి సరమందెచ్చటనైనా ఒకకుటీరము కావలెను. అంతకుమించి నాకువలయునదెద్ది? ఓ మూర్ఖచిత్తమా, దీనికైనీవింత చింతింప నవసరమేమి? అని యనుకొనుచు నా ఆత్మ నా పాదములలోనే యున్నట్లు వడిగ నడచుచుంటిని. పిండియల్ డాకూడ దాటి కళా

శాల వీధిసమీపమునకు వచ్చితిని. అచ్చటనుండి ట్రాంకారుపై వెళ్ళవలయుననుకొంటిని. కాని యింకనూకొంతదూరము నడచిపోవలనని యనుకొనుచుంటిని.అంతలో ఒక మేడగుమ్మమువద్ద

“కావలెను — కుట్టుపనిచేయు స్త్రీ” కావలెను.
మంచి జీతమివ్వబడును. మేడపైన ఆఫీసులోనికి రావలెను.

అని ఒక అట్టపై వ్రాసియుండెను. శిశుసంరక్షణాలయమందు అరుంధతి నా కుట్టుపనిని గూర్చిపలికిన పలుకులు నాకు జ్ఞాపకమునకు వచ్చెను. సంతస హృదయముతో ఆ మేడపైకి వెళ్ళితిని.

నన్నుచూడగనే ఒక స్త్రీ ప్రక్కగదిలోనుండి నా వద్దకు వచ్చెను. ఆమె శరీరము కొంచముస్థూలముగ యుండెను. ఆమె మధ్యవయస్కురాలు ఆమెధరించిన నగలు దుస్తులుగాంచిన చాల ధనికురాలువలె గాన్పించుచుండెను. ఆమె సింధు రాష్ట్రమునుండి వచ్చెనని నేను గ్రహించితిని. నేనువచ్చిన పని ఆమె కెరింగించితిని. అట్టిపని నాకు తగదన్నట్లు ఆమె కొంత ఆశ్చర్యముతో నన్నుచూచెను. పిమ్మట తనకుమార్తెను బిలచి నన్ను కుట్టుయందుపరీక్ష జేయుమనెను. ఆమె నన్నొక చావడి లోనికి దీసుకొని వెళ్ళెను. అందుచాలమంది స్త్రీలు కలరు. వారు అనేకవిధములైన కుట్టుపనులు చేయుచుండిరి. ఆమె ఒక కోటునకు బొత్తాముకట్టి కాజాకట్టిజూపెను. తరువాత నన్నాపని జేయుమనెను. నేను సూదినందుకొని నా నేర్పరితనమునుజూపియుంటిని. అందులకా యువతి నన్నుచాలమెచ్చి తన తల్లి

కాపనిని జూపెను. అప్పుడామె బాగుగనేయుండెను. కాని పని చాల నెమ్మది. అనిపలికి లోనికేగి తనభర్తను దీసుకొనివచ్చెను. అతడు కూడ నాకుట్టును పరీక్షించి డజను బొత్తాలు కాజాలతో కుట్టుటకు నాలుగణాలు నిర్ణయించి తాను వెళ్ళిపోయెను.

పిమ్మట యజమానుని భార్యనన్ను

"అమ్మాయిా! నీ వెచ్చట నివసించుచుంటివి? అని యడిగెను. నేను రామరాజతలాబ్‌లో నివసించు చున్నట్లును, అది పట్టణమునకు దూరమగుటచే ఇందెందైనను ఒకగది బాడుగకు దీసుకొని నివసించదనని చెప్పితిని. కాని నేను నాబిడ్డసంగతి మాత్రము ఆమెకు దెలుప సాహసము కలుగలేదు. అదృష్ట వశమున యజమానుని అధీనమందు ఒకగది దానినంటియే ఒక చిన్న వంటగది ఖాళీగా యుండెను. ఆ గదినాకిచ్చుట కామె సమ్మతించెను. బాడుగ నెలకు ఎనిమిదిరూపాయలు నిర్ణయించెను. మరుచటి దినమున నా సామాను దీసుకొని వచ్చి పనిలో ప్రవేశించెదనని యామెకు దెలిపి మేడదిగితిని.

నా జీవితమునకు చిన్న ఆధారము కలిగినందున నాకు ధైర్యము కలిగెను. రామరాజతలాబ్ నకు పోవు బస్సులో కూర్చొని రాత్రి తొమ్మిదిగంటలకు ఇల్లుచేరితిని.

# అధ్యాయం ౧౦

రామరాజ తలాబ్ నందు ఆ గృహయజమానురాలి సెలవు దీసుకొని నా సామానుతో పట్టణములోనికి వచ్చి మేడపై నున్న గది ఆక్రమించు కొంటిని.

మాయజమాని తారాచందు గిద్వాని ఆతడు సింధు రాష్ట్రమునుండి వచ్చెను. గిద్వాని బాయిబంద్ కులస్థుడు బాయిబంద్ కులమువారు విదేశములందు వ్యాపారమును నిర్వహించుటలో మంచి పేరుగాంచిరి. గిద్వాని ముప్పది – సంవత్సరములకు పూర్వము కలకత్తావచ్చి, చిన్నబట్టలదుకాణమును పెట్టెను. కాలక్రమమున మంచి అభివృద్ధిలోనికివచ్చి విరివిగ ధనమార్జించి ఆతడప్పుడు కలకత్తాలోనే రెండు పెద్దదుకాణములను తెరిచెను. అందొకదుకాణమందు సిద్ధముచేసిన దుస్తులను (రెడీమేడ్) అమ్ముచుండెను. ఆ బట్టలను తన మేడలోనే పనివారిచే తయారుచేయించుచుండెను. గిద్వానీకి మతవిషయములందు మూఢనమ్మకము కలదు. ఆచార వ్యవహారములందు చాల ఛాందస మనస్కుడు ఇంటయెందరు సేవకులుయున్నను తనకు మాత్రము తనభార్యయే మడికట్టుకొని వండి, పెట్టవలెను.

ప్రతిదినము ఎనిమిది గంటలగుసరికి మా యజమానుని భార్య నేను కుట్టవలసినబట్టలు మూటగట్టి పైకిదీసుకొని వచ్చుచుండెడిది. వాటినన్నిటికిని సరియైన బొత్తాములు కాజాలుకుట్టి సాయంకాలము క్రిందికి బంపుచుండెడిదానను. అన్నియు లెక్కజూచుకొని మరొక అరగంటలో నాకు రావలసినపైకము విడువక బంపుచుండెను. మొదటివారము పదిరూపాయలు సంపాదించగలిగితిని. నాకు చాలసంతస మొదవెను. కాని నాతిండికి, సంరక్షణాలయమునకు ఇవ్వవలసినపైకము పోగా పైకమునావద్ద చాలతక్కువగ యుండెను. అందుచే సాయంకాలము మరికొంతసేపు కూర్చొని పనిసేయుగా ఆ మరుసటి వారము పన్నెండురూపాలను సంపాదించగలిగితిని. ఇంకనూ నాకది తక్కువగనే యుండెను. వేకువజాముననే లేచి ఇంటి పను లెల్ల ముగించుకొని ఏకదీక్షగ దినమంతయు పనిజేయ మొదలిడితిని. అప్పటికి నాచేయికూడ ఆ పనియందు బాగుగ వలిగియున్నందున వారమునకు పదునాల్గు ఒక్కొక్కప్పుడు పదహారు రూపాయలుకూడ వచ్చుచుండెను. నా బిడ్డయొక్కయు, నాయొక్కయు కర్చులుపోను నెలకు పది పన్నెండు రూపాయలు సంచితము చేయగలుగుచుంటిని. నా విద్యకు మంచి దుస్తులు ఆటవస్తువులు కొనగలుగుచుంటిని. దినమందు కాలమువృథాగా వెలిబుచ్చుట నా కిష్టము లేకుండెడిది. నాకు తిండికివలయు పదార్థములెల్ల నా గదిలోనికే వచ్చునట్లు ఏర్పాటు జేసుకొనియుంటిని. ఇప్పుడు నా స్థితిని జూచి నన్నొక

బొనిసవలెయిూరు చూడవలదు. నేనట్లు పని జేసినను నాకది కష్ట మనిపించలేదు. నా ప్రయాసనెల్ల నా బిడ్డకై గదా! నాబిడ్డ నా ఆధారముపైననే పెరుగుచున్నందులకు నేను గర్వించితిని. అదే నాకు ఆహ్లాదమును కలుగజేసెను. వలయునంత శక్తి నా కొసగెను. ఉత్సాహభరితనై దినమంతయు పాడుచునే నా పను లెల్ల చక్కబెట్టుకొనుచుంటిని. మా ప్రక్కయింటిపావురము దక్క నా గదిలోనికివచ్చి నన్ను పలకరించు వారెవ్వరును లేరు.

నా విద్యను నేను ప్రతిదినము సాయంకాలము ఆరు ఎని మిదిగంటలమధ్య జూచుచుంటిని. సాయంకాలము పని ముగిసిన పిదప నే నచ్చటికేగుచున్నది. అచ్చటివారి కెవ్వరికిని తెలి యదు. దినమంతయు శ్రమపడి విశ్రాంతినిగోరి ఏపార్కునకో యేగుచుంటినని నా యజమానులు దలచుచుండిరి.

సాధారణముగ నేను రెండు ఫర్లాంగులు నడచివెళ్ళి పిమెల్ డా వద్దనుండు పార్కుసర్కసుకు ట్రాంపై వెళ్ళుచుం డెడిదానను. వచ్చునప్పుడు ఆ దూరమంతయు నడచియే వచ్చు చుంటిని. అందువలన రాత్రులందు నాకు బాగుగ నిద్రపట్టు చుండెడిది. నిక్కముగ ఆ సాయంకాలములు నాకుఆనందమును గూర్చుచుండెడివి. సంరక్షణాలయము మందు ఎంత జాగరూకతో జూచుచున్నను. వారు నా బిడ్డకింకనూ లోపము జేయుచుండిరని యే నేను తలచెడుదానను. ఒక్కొక్కప్పుడు నాకు తోచినట్లు, దానికి సంరక్షణ జేసి వచ్చెడిదానను. అదే నాకు సంతృప్తి కలుగు జేయుచుండెను. నా విద్య దినదినాభివృద్ధిని గాంచియు

దాని ముద్దులొలుకు చేష్టలను గాంచియు యుప్పొంగుచుంటిని. అట్టి సమయమందు దాని నిష్కళంకమైన మోమునందు నాకు నళినరంజనుడు గాన్పించుచుండెను. అదేమో కాని, నళినరంజనుడు సజీవుడై యున్నట్లు నాకుదోచుచుండెను. అది అసంభవము ఏచిన్న శరీరమునుజూచి, నా నళినరంజనుడందు లీనమై యుండెనని తలంచుచుంటినో, అయ్యది పెరిగి పెద్దదై నన్నానందాబ్ధిని దోలలాడ జేయునని నమ్మి, ఆ పరమాత్ముని స్తుతించుచుంటిని. నళినరంజనుడు నాకు పరలోకమునగాని కానుపించడని తలచడిదానను. కాని అది అసత్యము నా నళినరంజనుడు తిరిగి నా చేరువకు వచ్చుచుండెను.

మూడు నెలలు గడిచెను. మా యజమానుని రెండవ దుకాణము హౌరాలో యుండెను. అచ్చట పనిచేయుచున్న ఒక స్త్రీ కొంతకాలము సెలవుపై తన స్వగ్రామమునకు వెళ్ళినందున ఆమె తిరిగి వచ్చువరకు, గిద్యాని నన్నచ్చట పనిచేయుటకు నియమించెను. నాకా పని యిష్టము లేదు. రాబడి కొంత తగ్గుటయేగాక, అచ్చటకు ప్రతిదినము వెళ్ళివచ్చుట చాల ప్రయాసకరముగ యుండెను. నాకు ఖర్చుకూడా యధికమయ్యెను. యజమానుని మనస్సునకు కష్టము కలిగించుట కిష్టము లేక నేనందులకోరిమి వహించి ఎట్లో కాలము గడుపుచుంటిని. కాని నెలలుగడచినను ఆమె వచ్చునట్లు లేదు. అవి అమ్మకపు దినములగుటచే బసకు తిరిగి వచ్చుటకు చాల ఆలస్యమగు చుండెడిది. ఒక్కొక్కప్పుడు అర్థరాత్రివరకు వచ్చుటకు వీలయ్యెడిది కాదు.

నా బిడ్డను ప్రతిదినము జూచుటకు వ్యవధి లేకుండెడిది. దానికి తగిన సంరక్షణ లేక చిక్కిపోవుచుండెను. దానికి దగ్గు వచ్చుచుండెను. క్రమముగ అది యధికమయ్యెను. అరుంధతీ దేవి చాల నిర్లక్ష్యము జేసెను. కాని నా మనస్సు నిలువలేదు. సమీపముననేయున్న మందుల దుకాణమునకు వెళ్ళి వారిసల హాపై ఒక మందుకొని, అదినడుపు క్రమమును. దెలిపి అరుంధ తీదేవి కొసగితిని. అయినను దానిస్థితినిజూచి నాకు కాళ్ళుపాగ లేదు, రాత్రి పదిగంటలయ్యెను. నా బిడ్డను విడచి పోవుటకు మనస్సు యొప్పుటలేదు. తుదకు నేనొక తెలివిమాలిన పనిని గావించి నా బసకు తిరిగి వెళ్ళితిని. నా చిరునామా అరుంధతికి కాగితముపై వ్రాసి, అవసరమైన నాకు కబురు చేయుమని యామెకు జెప్పితిని. అట్లు నే నెన్నడు చేయలేదు. లేనికష్టమును నేనే దెచ్చి పెట్టుకొంటిని.

ఆ రాత్రి నాకు సరిగా నిద్దురపట్టలేదు, స్వార్థపరత్వ ముతో కూడియున్న నా ప్రేమకు నా బిడ్డను బలిదాన మొసగు చున్నట్లు నాకు తోచెను. గనుక నా బిడ్డను. నా వద్దకుదెచ్చు కొనుటయే మంచిదని నేను తలచితిని. కాని నేనట్లు చేయుట కెట్లు వీలుకలుగును ? నా బిడ్డ నా యొద్దనేయున్న నా పని సాగుటెట్లు ? దానిని కనిపెట్టుకొని యుండుటకొక దాదికావ లెను. దాదినిభరించగలశక్తి నాకు లేదుకనుక నాబిడ్డను వేరొక సంరక్షణాలయమందుగాని, అనాధ శరణాలయమందుగాని, బెట్టుట మేలనిపించెను.

కలకత్తాకు సమీపములోనేయున్న టీటాగరులో ఒక అనాధ శరణాలయముగలదు. అందు బిడ్డలకు తగు సంరక్షణ యొసగుచుండుట నేను వినియుంటిని. అందు నా విద్యను చేర్పించవలెనని నేను నిశ్చయించుకొంటిని.

ఉదయము ఎనిమిది గంటలకు టీటాగరు వెళ్ళుట కొక రైలుబండి కలదు. ఆ దినము నాకు కొంత పనియుండుటచే నేను దుకాణమునకు వెళ్ళజాలనని మా యజమానుని భార్యకు తెలిపి నేను టీటాగరు వెళ్ళియుంటిని, శరణాలయములోనికి వెళ్ళి అధికారులను కలసికొంటిని. వారి నిబంధన ననుసరించి సరియైన జవాబు నే నొసగలేనందున వారు నా బిడ్డను తమ శరణాలయమందు చేర్చుకొనుటకు నిరాకరించిరి. వేరు శరణ్యము లేనందున నేను కలకత్తా తిరిగివచ్చి, నాగదిని చేరితిని.

అంతలో మా యజమానుడువచ్చి, తీవ్రదృష్టిని నాపై బరుపుచు నాయెదుట నిలిచెను. నే నా దినమా పనిమాని నందుల కాతడిట్లు నాపై కోపముపహించెనని మొదట తలచితిని. కాని ఆ చూపులలో తన కాతిన్యత గానదగుచుండెను. నా రహస్యము లెన్నియో యాతని కెవిని బడెను. నా నడవడికలను ఖండించుటకై యాతడు వేచియుండెను. నేను భయముతో కంపించుచుంటిని.

"నిన్న అర్ధరాత్రివరకు నీ వెచ్చట యుంటివో నాకు తెలుపగలవా ?" అని గిద్వాని నన్ను ప్రశ్నించెను.

దానికినేను జవాబొసగలేదు.

"నీవు మాకొక పేరు జెప్పితివి. అది నీ నిజమైన పేరని ఋజువుపర్చగలవా?"

దానికిని నేను జవాబు చెప్పలేదు.

"నీవు మాకన్నుగప్పి నీబిడ్డను వేరొక తావునందుంచుట అసత్యమని నీవు వాదించగలవా? మరియు అది నీశాస్త్ర సమ్మతమైన సంతానమని నీవు నొక్కి వక్కాణించగలవా?"

ఆతని ప్రతిపలుకు ఒక ములుకు వలె నాకు గుచ్చుకొనుచుండెను. నా తల తిరుగుచుండెను. కాని నానోటినుండి మాట వెలువడలేదు. అదిగాంచి ఆతడు నన్నెంతయో ఆడిపోసెను. తుదకాతడు,

"అట్లయిన నేను వినునది నిక్కువమే. ఈ దినము మొదలు నీవు నాయొద్ద పనిచేయ నవసరములేదు" అనెను అంతలో ఆతని భార్య అచ్చటకు వచ్చెను. ఆమె నా కనుకూలముగ యాతనికి తగు సమాధానీ మొసగుటకు ప్రయత్నించెను. ఆతడు తన మూర్ఖతను విడువలేదు. కాని మరొక వారము దినములు మాత్రము నాకు గడువు నొసగి తానాస్థలమును విడిచిపోయెను.

చాలసేపటివరకు నేనట్లే నిలచియుంటిని. కొంతసేపటికి యజమానుని కుమార్తె నా గదిలోనికి వచ్చెను. ఆ ఉదయము నేను టిటాగరు వెళ్ళినపిమ్మట జరిగిన ఉత్తరమును బట్టుకొని ఒక సేవకుడు నాకై వచ్చియుండెను. ఆతడు మాయజమానుని కలసుకొని, నాబిడ్డకు చాలజబ్బుగా యుండెననియు, నన్ను

అరుంధతీదేవి రమ్మనమని చెప్పినట్లును దెలిపియుండెను. అరుంధతీదేవి యొసగిన ఉత్తరమును ఆమె నాకొసగెను. అది చదివిన తరువాత ఏమిజరిగెనో నాకు తెలియదు. సర్కులర్ రోడ్డు వెంబడి ఉన్మాదివలె నేను పరిగిడి పోవుచుండుట కూడ నాకు తెలియదు. కొంతవడికి నాస్థితి నాకు తెలియజెప్పెను, నాకంటబడువరకైన నా బిడ్డను ప్రాణములతో నుంచుమని యీపరాత్పరుని స్మరించితిని.

* * * * *

సంరక్షణాలయమును చేరితిని. నా హృదయము కొంత వదుల పడెను. అరుంధతీ దేవి నా బిడ్డను. తనయొడిలో పైచుకొనియుండెను. అది ప్రాణములతోనే యుండెను. కాని దానికిమైకము క్రమ్మియుండెను. వెంటనే నా బిడ్డను. నా చేతులలోనికి దీసుకొంటిని. దానిమైకము పోవుటకు కొన్ని ప్రయత్నములను జేసితిని. కాని ప్రయోజనములేక పోయెను. దానికీస్థితి ఉదయమునుండి కలదనియు, రాత్రినుండు పాలుత్రాగుట లేదనియు అరుంధతి నాకు తెలిపెను.

బిడ్డలసంగతి, వారికి వచ్చు రోగములు నాకేమి తెలియును ? బిడ్డలజీవించుట దుర్లభమన నాకు తోచెను. ఏమి చేయుటకును తెలియకుండెను. నేనువచ్చు మార్గములోనే ఒక వైద్యుని గృహము కలదు. నాకు ఆ సంగతి జ్ఞాపకమునకు వచ్చెను. వెంటనే బిడ్డను అరుంధతి కొసగి త్వరితముగ

నే నచ్చటి కేగితిని. డాక్టరు గృహమందే యుండెను. కడప్రాణ ములతోనున్న నా బిడ్డను గాపాడుమని యాతనిని ప్రాధేయ పడితిని. దయార్ద్ర హృదయుడగు యాతడు నా వెనువెంటనేవచ్చి బిడ్డను పరీక్షించి, తనసంచిలోనుండి ఒకమందు సీసానుదీసి నాకిచ్చెను. నాలుగుగంటల కొక పర్యాయము ఆ మందులో నొకమోతాదు కొసగమనియు, బిడ్డకు మెలకువ వచ్చినప్పుడు కొంచముపాలు పట్టమనియు చెప్పితాను వెళ్ళుటకు లేచెను. నా వద్ద పదిరూపాయలు మాత్రమేయుండెను. అంతకు మించి ఒకపైస అయినను. నావద్ద లేదు. ఆ పదిరూపాయలను డాక్టరు కొసగి, నాబిడ్డజీవించు ఆశకలదా? అని దీనవదననై యాతనిని ప్రశ్నించితి. డాక్టరు కొంచము యోచించి, "భగ వంతుని కృపచే నీబిడ్డ జీవింపవచ్చును. కాని అప్పుడామె చాల అపాయస్థితిలో నున్నది. ఆమె కిప్పుడు పరిశుభ్ర మగుగాలి ఆహారము ముఖ్యముగ కావలెను. "డాక్టరు బాబూ అట్లు యున నా బిడ్డ బాగుగ యుండునా?"

"నీవు ఎద్దియైన పల్లెటి గ్రామమునకు నీబిడ్డను దీసు కొని వెళ్ళిన ఆమెకు తప్పక ఆరోగ్యము చేకూరును"

"నేనట్లు... ... చేయక ... ... పోయిన ... ... మర ణించునా?" అనినేను పలికితిని. డాక్టరు ఒక దీర్ఘ విశ్వాస మొనర్చి "కావచ్చును" అని చెప్పి వెడలిపోయెను.

ఇప్పుడు కొంతపైక మవసరము ఆ పైకము నేను సంపా దింపలేనిచో నాబిడ్డ మరణించును — చీకటి పడుచుండెను.

గడియారము ఏడుగంటలు కొట్టెను. నాబిడ్డను అరుంధతి కొసగి రేపుదయము వచ్చెదనని ఆమెకుచెప్పి, తనివితీర నాబిడ్డకొక ముద్దొసగి, వీధితలుపు తెరచుకొని బయటనుండి గభాలున మూసి వీధిబడి పోవుచుంటిని. నా చేతియందప్పుడు ఎఱ్ఱని పైసయైనను లేదు. గిద్వాని నన్ను తనయొద్ద నౌకరిలో నుండి తరిమివైచెను. — ఇప్పుడు కొంతపైకమును దెచ్చుటకై బయలుదేరితిని. నాకాపైక మెచ్చటనుండి వచ్చును? సంరక్షణాలయము విడుచుచున్నప్పుడు కొంచమైనను యోచింపలేదు. ఇప్పుడు యోచింపదొడగితిని. కాని నా యోచనలకు పర్యవసానము కలదా? నాబిడ్డను గాపాడుకొనుట కొక్కటే మార్గము గానవచ్చుచుండెను. దానిని రక్షించుకొనుటకు నేనెట్టి కార్యమొనర్చినను, తప్పుగాదని నా అంతరాత్మ బలుకుచుండెను. ఏధర్మాత్మునికైనను నా కష్టములను నివేదించి అతనిని యాచించి నా బిడ్డను రక్షించుకొనుట నీతిబాహ్యము కాదు. అనాథనగు నేను అంతకుమించి చేయగలుగునదేమి? ఇట్లుయోచించుచు రాజమార్గమున కొక్కపక్కనున్న కాలిబాటపై వడిగ నడచిపోవుచుంటిని. అడ్డమువచ్చిన వారినెల్ల త్రోచుకొనుచు పోవుచుంటిని. వారుతిరిగినన్ను పరకాయించుచున్నను నేను లక్ష్యబెట్టలేదు. నాబన సమీపించుచుంటిని. కాని నేనచ్చటకు బోయిచేయునదియేమి? తినుటకు కొంచెము ఆహారమైనను లేదు. నాబిడ్డ బ్రతుకేమిగాను? దానికి శుభ్రమైనగాలి, ఆహారము ఆ తలంపు వచ్చినంతనే నాలోపిడుగు బడినట్లయ్యెను చటాలున నిలిచితిని. రక్తమువచ్చునట్లు నా పెదవిని కరచుకొంటిని. నేను

కను తిరిగిచూచితిని. కొంతదూరములో నా వెనుకనే వచ్చు చున్న వ్యక్తిని యాచింపవలెనని నిశ్చయించుకొంటిని. నా తలపై విద్యుద్దీపము ప్రకాశించుచుండెను. ఆతని రాకకై వేచి దీపస్తంభమునకు యానుకొని నిలచియుంటిని. ఆ వచ్చుచున్న వ్యక్తి పురుషుడే — ఆతడు నా సమీపమునకు వచ్చినంతనే తన నడక తగ్గించి వెంటనే ఆగిపోయెను. మరుక్షణముననే యా తడు నా ప్రక్కకువచ్చి నిలచెను. అతడు నా మోముపై మోమిడి తన తీక్ష్ణ దృష్టిని నాపై బరపెను. ఒక్కక్షణములో యాతని యౌవనసౌందర్యము, దీర్ఘకాయము, ముఖవిచక్షణ నాలో లీనమైయ్యెను. నా నోటమాట వెలువడ లేదు. ఆ స్థితి యందు నావంటి అబల ఏమిచేయవలెనో నాకు తెలియ లేదు. నా శరీరము కంపించుచుండెను. నా దృష్టి చంచలమయ్యెను. నేనొక తుఫానుమధ్య చిక్కుకొని యుంటిని. నా కాళ్ళలోని బలము నా స్వాధీనము తప్పెను. కాని ఆతని దీర్ఘ బాహువులు నన్ను స్వాధీనము గావించుకొనెను.

"శశీ! శశీ! యను అతని కంఠధ్వని నాకు చిరపరిచిత మైనదే — నాకన్నులు తెరిచి యాతనిని మరల జూచితిని. ఆతడు ఎవరో నాకు తెలియును. అతడు నా మనోహరుడు — నళినరంజనుడు.

"శశీ! భయపడకుము నేనే —"

అదేమోకాని ఆతనిని తప్పించుకొని పారిపోవుటకు నేనే ప్రయత్నించితిని. కాని ఆతనిని భీమబాహువులు నన్నా స్వర్గతుల్యమగు సౌఖ్యమునుండి తప్పించుకొననివ్వ లేదు. నాకు

వైశమ్ముల క్రమ్మినంతనే " యిందిరాదేవి! శీఘ్రముగా రమ్ము. వోటారుతలుపులు తెరువుము. భగవత్కృపచే మనకష్టము ఫలించెను. అనెడిపల్కులు నా చెవినిబడెను.

*  *  *  *  *

నాకు స్పృహవచ్చెను. కాని నే నిప్పుడెచ్చటయుంటిని? దేవతాచిత్తరువులతో చక్కగ నలంకరింపబడిన ఒకగదిలో తెల్లని పాన్పుపై బరుండియుంటిని. గవాక్షమున కెదుట ఉద్యానవనము నేత్రానందము గలుగ జేయుచుండెను. నే నిప్పుడెచ్చటయుంటినా, అని యోచించుచు గదిని కలయ జూచుచుండ నా మంచమునకు ఆనుకొని ఇందిరాదేవి చిరునవ్వుతో ప్రత్యక్షమయ్యెను.

" శశిరేఖాదేవి! ఇప్పుడు మెలుకువవచ్చెనా?" అని శాంతవచనములతో నన్నుపలుకరించెను. గడచిన వృత్తాంతము లెల్ల నాకు యింకనూ స్వప్నమందలి తుపానువలె గోచరించుచుండెను.

" ఇందిరాదేవి! నేనుజూచునదంతయు నిక్కువ... ... ... ... "

" అవును అంతయు యదార్థము."

" అట్లయిన అతడు మరణించలేదా?"

" అది యదార్థమును తప్పివచ్చిన వదంతి. అది ప్రచురించిన నెలదినములకు పిమ్మట వార్తాపత్రికలు, అతడుసజీవియై యున్నట్లు తెలియబరచెను. నీ కది తెలియదా?".

" ఆతడిప్పుడెచ్చటయుండెను ?" అని పలుకుచు నేను నా తలగడ పైనుండి లేవనుంకించితిని.

" వలదు. నీవు లేవవలదు. నీవు తొందరపడరాదు. నేను డాక్టరులకు కబురుబంపవలెను " అని నన్ను మరల పరుండజేసి గదివిడిచి యిందిరాదేవి వెడలుచుండెను. ఆమెను పోనీయక —

" ఇందిరాదేవి ! మరికొన్ని సంగతులు ముందుగ నాకు దెలుపుడు " అని కోరితిని.

" వలదు. ఇప్పుడు వలదు. నీవు నిశ్చలతవై యుండ వలెను. "

" లేదు మీరు తప్పక చెప్పవలెను. దయవుంచి.

" నీవుచెప్పునది నీ కుమార్తెను గురించియా ?

" అవును " అని ఆత్రుతతో బలికితిని. "

" నీ బిడ్డ సురక్షితముగ యుండెను. ఆమెను ఈ పట్టణమునకు సమీపమున నేవున్న ఒక పల్లెకు బంపియుంటిమి. గనుకనీవు పరుండుము " అని చెప్పి ఇందిరాదేవి వేరొక గది లోనికి పోయి వెల్లి ఫోనులో నెవరితోడనో మాట్లాడెను కొంత సేపటిలో డాక్టరువచ్చి నన్ను పరిక్షచేసి, కొద్దిదినములలో నేను పూర్తిగా ఆరోగ్యమును బడసెదనని జెప్పెను.

డాక్టరు అనుమతించినపిమ్మట నన్నుజూచుటకు నళిన రంజనుడు వచ్చెను. తతనిని జూచుటకై నా మనస్సెంతయూ తొందర పడుచుండెను.

డాక్టరు వెళ్ళిన కొంతసేపటిలో గంగాధరశాస్త్రిజీ నా గదిలోనికి ప్రవేశించి, నా స్థితినిగాంచి దైవమును పొగడెను. శాస్త్రిజీ నాకై వంగదేశమంతయు గాలించెను తుదకు కలకత్తావచ్చి, ఆరుమాసములనుండియు ఆశను విడువక నాకై తిరుగుచుండెను. ఆ మహాశయుడు నా యోగక్షేమముల నారసి నాకు ధైర్యమును గొల్పెను. ద్వారమువద్ద ఎలెక్ట్రిక్ గంట మ్రోగెను. ఇందిరాదేవి ద్వారమువద్దకేగి తలుపు తెరిచి, నా వద్దకువచ్చి నెమ్మదిగ "శశిరేఖా! నీ నళినరంజనుడు వచ్చియుండెను. అతడు నిన్నుజూడగోరుచుండెను. నిర్మల మనస్కవై నీ వాతనిని రప్పించుకొనగలవా?" నా హృదయము వేగముగ కొట్టుకొనుచున్నను, "రప్పింపుము" అని నేను పలికితిని. నాకు ప్రక్కనున్న అద్దములో జూచుకొని నా ముఖముపై బడియున్న వెంట్రుకలను చేతితో సరిజేసుకొని పిదప కన్నులను మూసికొని నానళినరంజనునికై వేచియుంటిని. నేనట్లెందుకు కన్నులు మూసికొంటినో భగవంతునికే తెలియవలెను. కొంతసేపటి వరకు నిశ్శబ్దము వెలువడెను. తరువాత నా కన్నులనుదెరచి గవాక్షమున కెదుట నా నళినరంజనుని జూచితిని. ఆతని గంభీరమైన మనోహరాకారము మునుపటికంటె తేజోవంతమైయుండెను. కొన్ని క్షణాలవరకు అతడు మాట్లాడలేదు. నా జీవితమునందలి మార్పును యాతడు జూచుచుండెనని నేను గ్రహించితిని. పిమ్మట నన్ను సమీపించి చాచియుంచిన నా రెండుచేతులను బట్టుకొని "శశీ! నన్నుమన్నింపుము. నన్ను మన్నింపు

మనుచు నా మంచముపై కూర్చొని నా చెక్కిలిపై ముద్దొసగెను. ఆ సంఘటన నా హృదయము భరింపలేకపోయెను. ఇందిరాదేవి! ఇందిరాదేవి! మంచమును దీసుకొనిరండు. శశి సొమ్మసిల్లెను. అనెడి స్త్రీయుని పలుకులు మాత్రము వినియుంటిని. కాని మరుక్షణమున నే నాకు తెలివివచ్చెను. నళినరంజనుడు వెంటనే నన్ను విడిచి వెళ్ళినను. పెద్దసౌఖ్యతరంగ మొకటి నాపై వెల్లువిరసెను.

*   *   *   *   *

ఒకవారము దినములలో నాకు చాల స్వస్థత కలిగెను. నేను నెమ్మదిగ లేచి, అగదియందే పచారులు చేయగలిగితిని. నళినరంజనుడు నన్ను జూచుటకై ప్రతిదినము వచ్చుచుండెను, ఆతని రాకయే నాకు ఆరోగ్యమును చేకూర్చుచుండెను. ఆతడు నా ప్రక్కనుగూర్చొని ముచ్చటించుచుండ "నేను కలగాంచుచుంటినా" అని యనిపించింది. నాఉత్సాహమును రేకెత్తించుటకై యాతడు తన హిమాలయయాత్రా హంశములను నా కెరిగించు చుండెడివాడు. వెంట్రుకవాసిలో తప్పించుకొనిన ఆతని గండములను వినినప్పుడు నేను కంపించుచుండెడిదానను. కాని ఆతని హిమాలయ శిఖరారోహణము పూర్తిగానందున నేను చాల చింతించితిని.

నెల దినములు గడచెను. నళినరంజనుడు అప్పటి నుండియు నా మూలమున కలకత్తాలోనే యుండెను. తన తలి

దండ్రులను జూచుటకైనను అతడింతవరకు శాలీగంజికి వెళ్ళి యుండలేదు. శాస్త్రిజీవద్దనుండి నాకొక లేఖవచ్చెను. అందు శాలీగంజివార్త లెన్నియో నా కెరింగించెను. అందుకొన్ని నాకు చాలవిషాదమును కలిగించెను. నా తండ్రియొక్క ఆర్థికస్థితి క్షీణించెను. అతడు స్థాపించిన శాలీగంజి బ్యాంకు నశించెను. అందు శాలీగంజి వాసులు చాలమంది ప్రభుత్వమువారి శిక్షకు పాత్రులైరి. కాని నాతండ్రిమాత్రము అట్టి శిక్షనెట్లో తప్పించుకొనెను.— నళినరంజనుని తల్లి నేను సురక్షితముగ యుంటినని తెలిసి మిక్కిలి సంతోషించెను. ఆసాధ్వి నా జీవితము అకలుషితమైనదని నుడివెను. తన గృహము నాకు సుస్వాగతమొసగునని ఆమెశాస్త్రిజీకి దెలిపెను. ఆవార్త నన్ను స్వర్గసోపానముల కెక్కించెను.

సాయంకాలము నళినరంజనుడు నావద్దకు ఇదేవార్తను దీసుకొని వచ్చెను. నన్ను శాలీగంజికి దీసుకొనివెళ్ళుటకై అతడు నిశ్చయించెను. మేము శాలీగంజికి వెళ్ళుటకు ముందు విద్యనుజూడవలెనని కోరిక గలిగెను. కాని నళినరంజనుడందుల కియ్యకొనలేదు. ఆమరుచటిదినమే శాలీగంజికి ప్రయాణమైతిమి.—

## అధ్యాయం ౧౧

నళినరంజనుడు కాళీగంజికి వచ్చుచున్న వార్త దెలిపి ఆతనికి స్వాగతమిచ్చుటకై ప్రజలు తండోప తండములుగ స్టేషను వద్దకు వచ్చిరి. శాస్త్రిజీ డాక్టరు సునీలబాబు కూడ వచ్చియుండెను. డాక్టరుబాబు తన కుమారుని కౌగలించుకొనెను. నాతల నిమురుచు నన్ను కుశల ప్రశ్నలు గావించెను. మేము మోటారులో గృహము చేరితిమి. నళినరంజనుని తల్లి వసంతాదేవి నన్ను కౌగలించుకొని నామోము ముద్దిడుకొని లోనికి దీసుకొని వెళ్లెను. ఆశ్చర్యము — లక్ష్మి వసంతాదేవి వద్దనే పని జేయుచుండెను.

నా తండ్రి అస్థిచాలవరకు పాడయ్యెను. నా తండ్రియిపుడు రాచకురుపులవలన బాధపడుచుండెను. ఆతనికి అంత్యదినములు. మా పెద్దభవనములో మాపిన్ని; గంగమ్మాత మేయుండిరి. మా వంశమునకు వంశనామమునకును, నేను అపఖ్యాతి దెచ్చితిననియు, నా ముఖమునుగూడ తాము జూడ నొల్లననియు మా పిన్ని, గంగ తమకు కనబడిన వారికెల్ల జెప్పుచుండిరి. నిండు అగ్నిహుత్రమువంటి నా జీవితమునకు, అట్టి నికృష్టపు వాక్కు లెట్టిహానియు కలుజేయవు — నన్ను మోసగించి

చేరదీసుకొనెనని నింద మోపుచు, నా భర్త నళినరంజనునిపై అభియోగమును దెచ్చుట యోచించుచున్నట్లుకూడ వినియుంటిని. కొన్ని దినములలో గృహోపరణమునొదలి తోటలో నడువగలుగుచుంటిని.

* * * * *

ఒక నెలదినములు గడిచెను. ప్రతివారము నళినరంజనుడు కాళీగంజి కలకత్తాలమధ్య తిరుగుచుండెను. హిమాలయ శిఖరారోహణమును పూర్తిగావించుటకై మరొకపరి తగు సన్నాహము గావించుచుండెను.

మోటారు ప్రమాదము.

“ నేటి ఉదయము సింగపూర్ రోడ్డుపై గొప్పమోటారు ప్రమాదముజరిగెను. అందు కాళీగంజి జమీందారు రాజాప్రఫుల్లచంద్ర ముఖర్జీ మృతిజెందెను. రాజాసాహెబ్ మిత్రురాలగు లలితాదేవికి స్వల్పగాయములు తగిలెను. మలుపుతిరుగునప్పుడు ప్రమాదవశమున ఒక చెట్టునకు ఢీకొని మోటారు బద్దలయ్యెను. ఆ వార్తవినినంతనే నాకు దుఃఖమువచ్చెను. నా బంధుమిత్రులెవరైన మరణించినకలిగెడి విచారము మాత్రమే నాకప్పుడు కలిగెను.

నళినరంజనుడు వెనుకపాటున నా గదిలోనికి ప్రవేశించి తన రెండు చేతులతో నా కన్నులను మూసెను.

“ శశీ? మనకిప్పుడు స్వేచ్ఛ కలిగినది.నీకది తెలియును. గడచిన యుదంత మంతయు మరచిపోమ్ము. నీవు పలుయిదు

ములు బడితిని. అది యథార్థము. గతజలసేతుబంధన మేల ? ఆ దుష్టులను దైవమే వీక్షించి తగు శిక్ష నొసంగుచుండును. ఇప్పుడు మనయిరువురకు మధ్యనెట్టి అడ్డము లేదు. మనమి ప్పుడు వివాహము గావించుకొని సుఖముగ నుండవచ్చును." అని నళినరంజనుడు పలికెను. నాలో ఉత్సాహము జనించెను. నా ఈప్సితము యిప్పటికి కూడేరినున్నది. అవి తలచుకొనుచు కొంతసేపటి వరకు నళినరంజనున కెట్టి ప్రత్యుత్తరమొసగ లేదు

"కాని నళిన్ ! మనమెప్పటికైన భార్యాభర్తల మగుదు మని నీవు నమ్మియుంటివా ?"

"నమ్మియుండుటయా ?" అనిఒక్క నవ్వునవ్వి నళిన రంజనుడు "తప్పక జరుగును. జరిగి తీరును. మరొక్కమాట శశీ ! కర్మవశమున నేను నిన్ను వివాహము గావించుకొన లేని-చో బ్రహ్మచర్య మవలంభించి నా జీవిత శేషమును దేశసేవకై న ర్పించెదను. అని నుడివెను. నాలో ఆనంద ముప్పొంగెను. —

* * * * *

నేను శాస్త్రిజీ గృహమునకు వెళ్ళితిని. శాస్త్రిజీ యేదియో గ్రంథము వ్రాయుచుండెను. నన్ను చూచినంతనే శాస్త్రిజీ వ్రాయుటమాని, నన్నొక చాపపై కూర్చుండ బెట్టెను. పిమ్మట నేను మందస్వరముతో,

"శాస్త్రిజీ ! మీరు వివాహ ప్రసంగమును వినియుం టిరిగదా ?" అని యడిగియుంటిని. శాస్త్రిజీముఖము ఎర్రబ డెను. కొంతసేపేదియో యోచించి,

"అమ్మా! నేనట్టి వివాహమునకు సమ్మతింపను. అది శాస్త్రదూష్యమే గాక, సనాతన ధర్మమునకుగూడ బాహ్యమైనది. నీవు రాజాప్రఫుల్లచంద్రముఖర్జీ వితంతువని యెరుగుచు ప్రపంచమింకనూ నిన్ను రాణిశశిరేఖాముఖర్జీ అనియే బిలుచుచున్నది." అనిపలికెను.

"శాస్త్రీజీ! వివాహమైన పిదప నాభర్తగృహమందు నేను నుడివిన పలుకులు మీకు జ్ఞాపకముండవచ్చును. ఆకట్టుబాట్లకు లోనై నే నాతనితో సంచరించితిని. నేనాతనిని ప్రేమింపలేకపోతిని పిమ్మట జరిగిన హాంశములన్నియు మీకు దెలియును. అట్టిచో రాజాప్రఫుల్లచంద్రుడు నా భర్తయెట్లగును? అతని వింతంతువునై నే నెందులకు నా జీవితం శేషమును గడపవలెను?" అని నేను ఖండితముగ చెప్పియుంటిని ——

"శశిరేఖాదేవి! నీవు చెప్పినదెల్ల యదార్థము. కాని హిందూమతధర్మము స్త్రీ తన వివాహమును. రద్దుగావించుకొనుటగాని, పునర్వివాహమునకుగాని. వితంతు వివాహమునకుగాని, అంగీకరించదు. కుమారీ! నీ కాసంగతి నేనింతకు పూర్వమే దెలుపలేదా?

"శాస్త్రీజీ! స్వార్థపరాయణులు స్వప్రయోజనపరులగు సనాతనులట్టి వ్రాతలనువ్రాసిన మనమేమి గణించవలెను? శాస్త్రవేత్తయు, స్వార్థత్యాగ పరాయణుడగు రాజా రామమోహనుని ఆదర్శకమును మనమేల ఆచరణలో బెట్టరాదు. ఈకాలమందు రాజారామమోహనుని ప్రచారమే కడు ఆచరణార్హమైనది." అని నేను పలికియుంటిని. శాస్త్రీజీ తలనూపి,

"అమ్మా ! నీవు కడు బేలవు వైవాహికము కడు పవిత్రమైనది. అగ్నిముఖమున గావించిన ప్రమాణమును భంగముగావించుట కెవ్వరును సాహసింపరాదు. తల్లీ ! నీవిషయమై యోచించిన నా హృదయమునుండి రక్తము ప్రవహించుచుండెను. కాని అదంతయు భగవదేచ్ఛకదా ? అని పలుకుచు శాస్త్రీజీ తన యుత్తరీయముతో కన్నీరుతుడుచుకొని——

"అమ్మా! నీవు నన్ను నిందింపకుము. శాస్త్రసమ్మతముగాని వివాహమునకు నేను మామ్మాటికిని సమ్మతింపను. కనుక నీ తలంపును నీ మనస్సునుండి బారద్రోలుము." అని చెప్పి నన్ను సాగనంపెను.

నేను గృహమును చేరినంతనే నళినరంజనుడు చిరునవ్వు నవ్వుచు, "శశీ! నీ వెచ్చటికి వెళ్ళితివి ? ఏమైనను ఉపద్రవము జరుగలేదుకదా ?" అని ప్రశ్నించెను. నేనప్పుడు జరిగిన యుదంతమంతయు జెప్పితిని.

నళినరంజనుడట్టి యుద్రేకమును జెందునని నే నెప్పుడును యనుకొనలేదు, ఆతనికంఠము వింటినరమువలె ధ్వనించుచుండెను. "శాస్త్రీజీ ! మహాసాత్త్వికుడు. శాస్త్రవేత్త ఆతడొక ఆదర్శకజీవి. నవీనధర్మవిధిని మనము వివాహమాడెదము. ఇందులకు నా తలిదండ్రులు సమ్మతించిరి." అని నళినరంజనుడు చెప్పెను. నళిన్ ! చిన్ననాటనుండియు మనయిరువురి శ్రేయమును గోరు శాస్త్రీజీని యొప్పించవలదా ?"

"శశీ! ఆ శాధ్యతనాది నే నాతని వెట్లయిన మనమూర ములోనికి దీసుకొని వచ్చెదను. నాకాధైర్యముకలదు. అని చెప్పి నళినరంజనుడు సన్నాలోనికి గొనిపోయెను —

నళినరంజనుడు కలకత్తా వెళ్ళి పదిదినము లయ్యెను. ఆతడు కాళీగంజి వచ్చుట కీవర్ష్యాయము చాలగనువయ్యెవని నేను యోచించుచుంటిని. కాని ఆదినమే యాతనివద్దనుండి నాకొక లేఖవచ్చెను. ఆ లేఖ యందు, నళినరంజనుడు తిరిగి హిమాలయ యాత్రకు సన్నాహమంతయు గావించినట్లు, సంఘ మువారందుల కామోదించినట్లును, మరొకమూడు, నెలలలో తాము యాత్రాభిముఖులై పోవనున్నట్లును నాకు దెలిపియుం డెను. ఈలోపున నే మా వివాహసమస్యను పూర్తిజేసి, తాను యాత్రముగించుకొని వచ్చువరకు నన్ను నేనీటాల్ లో నా ఆరోగ్యాభివృద్ధికై యుంచుటకును నిశ్చయించెను.

ఆ ఉత్తరమును జూచినంతనే నేను దిగులొందితిని —

* * * * *

నళినరంజనుడు కలకత్తానుండివచ్చెను. ఆతడు వచ్చుటకు ముందుగనే చక్కగ నలంకరించుకొని; నే నాతని రాకకై ఎదురు జూచుచుంటిని. నళినరంజనుడు నన్నుజూచి నాకు బాగుగ ఆరోగ్యము చేకూరినదని దలచెను.

నళినరంజనుడు వివాహమునకై ముహూర్తము నిశ్చయింపజేసి, తగు సన్నాహమునకై యోచనలుసల్పుచుండెను. అయ్యో! నే నెంతటి మోసగత్తెని! యదార్థమును దెలిపినచో

అతనిపై పిడుగుబడును. నిరుత్సాహియై తాను యొవర్పబోవు హిమాలయ శిఖరారోహణమునకు స్వస్తి జెప్పును. ఆవార్త ఆతనికి నిలకడమీదనే దెలుపవలెను. అట్లుగానిచో తనంతట తానైనను గ్రహించును.

కొన్ని దినములనుండి, నాకు దగ్గు వచ్చుచుండెను. నాకు దగ్గువచ్చునప్పుడు నళినరంజనుని చెవిన బడకుండునట్లు ప్రయత్నించుచుంటిని. ఒకనాడు నేనాతనితో నేదేదియో ప్రసంగించు చుండ, ఆపాటుదగ్గునన్ను పరీక్షలో పెట్టెను. నళినరంజనుడదిగాంచి నిశ్చేష్టుడయ్యెను. కాని నేనది కప్పిబుచ్చుటకు ఒకనవ్వునవ్వి "ఇదేమియును కాదు. చిన్ననాట నుండియు వేసవిలో నన్ను పాడుదగ్గొకటి బాధించుచుండును." అని పలికితిని. నళినరంజనుడది నమ్మెనని తలచితిని.

నాతండ్రి తన అంత్య దినములను గడుపుచుండెను. నాకెద్దియైన సంభవించిన నాతండ్రి నాబిడ్డను తన యధీనముగా వించుకొని, దానినితన యాస్తికై సర్వాధికారినిగ జేయవలెనని తలంచుచున్నట్లు నాకు తెలిసెను. నాతండ్రి ఇట్లెందుకు చేయవలెను? తన మనుమరాలును తన యధీనము గావించుకొని తనయుల్లునికై వినియోగించిన ధనమునకు ప్రతి ఫలముగ ఆయాస్తిని రాబట్టుకొనుటకై నట్టి పన్నాగమును బన్నుచుండెనని నేను గ్రహించితిని. నాబిడ్డనున్యాయస్థానములందు బెట్టి ఔరసత్వమునకై నెట్టి అపఖ్యాతికి దానిని పాలు జేసెదరో యన్ని భయపడితిని. ఈవార్త నళినరంజనుని జెవిని వైచి

తిని. నళినరంజనుడదంతవిని, తనకోపమును అణచుకొని "శాస్త్రిగారమ్మా అదెట్లు పొసగునో జూచెదను. నీవు నిశ్చింతవై యుండుము." అని మాత్రము నాతో బలికెను.

సాయంకాలమయ్యెను. నళినరంజనుడు నాతండ్రి వద్దకు వెళ్లెను. వెళ్ళునప్పుడు శాస్త్రీజీని తన వెంట దీసికొనివెళ్లెను వారు నాతండ్రి గృహమును ప్రవేశించినంతనే సుమారు నలుబది సంవత్సరముల వయస్సుగల స్త్రీ వారిని కలుసుకొనెను. ఆమె నాతండ్రి యుంపుడుగత్తెయగు ప్రభావతి యని నళినరంజనుడు గ్రహించెను. ఆమె తమను బలుకరించుటకు ముందుగనే నళినరంజను డామెను నిర్లక్ష్యముజేసి శాస్త్రీజీ వెంట హాలులోనికి బోయెను.

ఒక మేజావద్దకొన్ని కాగితముల పుస్తకములను ముందు వైచుకొని వకీలు కూర్చొనియుండెను, మేజాపై విద్యుద్దీపము వెలుగుచుండెను. వేరొక వైపున నాంతండ్రియొక్క కార్యదర్శి యుండెను. అతనినిగంగూలి దాదాయని పిలచెదరు. అతడు నాతండ్రియొద్ద బదిసంవత్సరములనుండి పనిజేయుచుండెను. అతడు వచ్చిన తరువాతనే క్రమముగ నాతండ్రి ఆర్థిక స్థితి క్షీణించెను. దుష్టసలహా నిచ్చుటలో యాతనికి మంచి నేర్పరి తనముకలదు.నాతండ్రి ప్రాణమాత్రా వశిష్టుడై వుండెను. శాస్త్రీజీ నళినరంజనునితో హాలులోనికి బ్రవేశించి నంతనే నాతండ్రి "ఎవరువారు ?" అనెను.

"శాస్త్రీజీ... సర్ నళినరంజన్ ఛటర్జీ" అని వకీలు జవాబిచ్చెను. నాతండ్రి కోపోద్రేకుడై యొడలు తెలీక

ప్రక్కనే యున్న చేతికఱ్ఱ నూతగ దీసుకొని తూలుచు నళిన రంజనుని సమీపించి, ఆతని మెడపై చేయివైచి—

"ఓరీ! పిశాచీ! దుష్టబుద్ధీ నీవు———" అని యింకా నెద్దియో నోటికివచ్చిన తిట్లుదిట్ట నారంభించెను. నళినరంజనుని క్రిందకు బడద్రోయుటకై యాతని కోటును మెడపట్టీవద్ద బట్టుకొని లాగుచుండెను.

నళినరంజను డాతని అంత్యదశను గాంచి విచారించుచున్నందున, నాతండ్రి చేష్టలను లెక్కచేయక ఆతని చేతిని త్రిప్పి—

బాబూసాహేబ్! మీరువృద్ధులు. మీరు శశిరేఖా దేవి తండ్రియగుటవలన నాకుగూడ మీరు పూజనీయులు కనుక దయచేసి మీరు కూర్చొనుడు" నాతండ్రి ఆయాసముతో నటులే కూర్చుండెను.

తరువాత గంగూలి శాస్త్రిజీ వైపునకు జూచి, కండ్లెఱ్ఱజేసి, "శాస్త్రిజీ! బాబూసాహేబ్ నకు చాల అస్వస్థతగ యున్న సంగతి మీకు తెలియదా? రేపుదయము శస్త్రచికిత్స కానున్న సంగతి మీ కెరుక లేదా?" అని ప్రశ్నించెను.

"గంగూలిబాబూ! నాకాసంగతి తెలియును."

"మీరీ మనుష్యుని దీసుకొనివచ్చి బాబూసాహేబ్ మనస్సును వ్యాకుల పరచితిరి.

గంగూలీబాబూ మానవ తారతమ్యము కార్యవిచక్షణ శోధించు సూక్ష్మబుద్ధి మీకు గలదని నేనెన్నడును భావించ లేదు." అని శాస్త్రిజీ పలికెను—

"అవును సత్యసంధులు, శాస్త్రవేత్తలు, వేదవేదాంత నిధులు, సనాతన ధర్మస్థాపకులని ఈపురజను లనుకొనుచుండిరే గాని, మీశాయాధిక్యత నేనెప్పుడును యొసగలేదు. అట్టి మీకు నాసూక్ష్మబుద్ధి నెరుంగుట కష్టతరమే. శాస్త్రవిధిని జరిగిన వివాహమును మట్టుబెట్టిన ద్రోహిని వెంట గొని వచ్చుట—" అని ఎద్దియో పలుకుచుండ శాస్త్రిజీ గంగూలీకి తగిన ప్రత్యుత్తరమొసగెను. శాస్త్రిజీ కోపమును బట్టలేక గంగూలీని ఉద్దేశించి, "ఓరీ! దుష్టుడా! దుష్టబుద్ధివగు నీప్రోత్సాహము లేనిదే బాబూసాహెబ్ యింతటిఘోరము నెన్నడును జేసియుండడు. మీతప్పు కప్పిపుచ్చుచుంటిరా? ఛీ! ఇట్టిదుష్ట సంఘముతో నాకేమిపని" అని తన కోపజ్వాలల వెచ్చటబరపి, ఆగదిని విడిచి వెళ్ళెను.

అప్పుడు నాతండ్రి నళినరంజనుని జూచి "ఇంక మీరును మీగురుదేవుని యనుసరింప వచ్చును.' అని తృణీకరించెను. నళినరంజను డది లెక్కచేయక—

"బాబూసాహెబ్! నేనువచ్చిన పనిముగియక నే వెడలువాడను గాను నేను చెప్పవలసినది కొంతయున్నది" అనెను.

"అట్లయిన అదెట్టిదో దెలుపుము." అనిబలికెను.

"తొందరపడకుడు మీకిప్పుడే తెలియగలదు" అని పలికి నళినరంజనుడు నాతండ్రి వైపునకుతిరిగి నాబిడ్డ విషయమై తాను వినిన వార్త యదార్థమాయని ప్రశ్నించెను. నాతండ్రి తనవకీలును జవాబొసగమనెను. అప్పుడు వకీలు నళినరంజనునితో—

"అయ్యా! ఆవిషయమై మీ అభిమతమేమి ?" అనెను.

"ఏకారణము వలననైనను, శశిరేఖాదేవి, తనకుమార్తెను కేవలము తన స్వాధీనమందే యుంచికొనినచో, తండ్రి ఆబిడ్డను తన యధీనము జేసుకొని యూహించుట యదార్థమా ?" అని నళినరంజనుడు ప్రశ్నించెను. అందులకు వకీలు,

"తల్లి మరణించినచో మాతామహుడేల ఆబిడ్డనుపోషింపరాదు ?" అనెను.

"ఒకవేళ మాతామహుడే ముందుగ చనిపోయిన ?"

"అప్పుడు కోర్టువారే ఆబాలికను మాతామహుని ఆస్థిపై హక్కుదారినిగ జేసి, బాలికకు యుక్తవయస్సు వచ్చు వరకు రక్షకి నేర్పరచెదరు."

"రక్షకి నేర్పరచెదరా ? ఈమెయేనా ఆ రక్షకి ?" అని నళినరంజనుడు ద్వారమువద్ద నిలుచునియున్న ప్రభావతిని జూచెను. వకీలందులకు తలనూపి,

"కావచ్చును !" అనెను.

"ఈమె ఆబిడ్డనేమి చేయును ?"

"ఏమి చేయునా ?" అని మాత్రముపలికి, పిమ్మట ఏమి జెప్పకొనుటకును దోచక వకీలు తన గడ్డమును వ్రేళ్ళతో సవరించుకొని—

"అదంతయు మీకవసరము. నాక్లయింటు నాకను మతిచ్చినందున, నేను మీకు విపులముగ జెప్పుటకు సాహసించుచుంటిని—బాలికకు నిజమైన తండ్రిసంగతి యటుంచుము—యదార్థము మీకు దెలియును.

"చెప్పుడు—అని" నళినరంజనుడాతనిని ప్రోత్సహించెను.

"బాలికకు నిజమైనతండ్రి సంగతి యెట్లున్నను, ఆమె తల్లి వైవాహిత, తల్లివితంతువైన మాత్రమున, ఆవైవాహిత ఔరసత్వమునకు బాలికదూరము కానేరదు. అట్లుగనేమా తా మహునిపక్షమునగూడ వర్తించును." అనివకీలు బలికెను.

న్యాయచట్టమందుల కంగీకరించునా?" అని నళినరంజనుడు ముదలకించెను.

"తప్పకయంగీకరించును?" అని వకీలునుడివెను.

"తప్పక యంగీకరించునా?" అని బలికి; నళినరంజనుడు నాంద్రివైపునకు, తిరిగి రమేశబాబూ! వినుడు—మీా న్యాయాధికారులతోను, న్యాయచట్టములతోను నాకు బనిలేదు. మీాకుమార్తె మీాయాస్తి నెన్నటికిని ఆసించదు. తనకుమార్తెకు చెందుటకైనను ఆసింపదు. మీా వెనుక నిలచియున్న స్త్రీనే మీాయాస్తిపై నిరభ్యంతరముగ సర్వాధికారినిగ జేయుడు— నేను కాళీగంజ విడిచి వెళ్ళుచుంటిని. నేను తిరిగివచ్చుటకు సంవత్సరము పట్టును. లేదా రెండు సంవత్సరములు కావచ్చును. శశిరేఖ నావెంట నాభార్యయై వచ్చుచుండెను. ఆమె తన కుమార్తెను నాతల్లివద్ద విడుచుటకు నిశ్చయించుకొనెను. శశిరేఖ కొద్దినాళ్ళలో మరణించునని మీారు యూహించుచుండిరి. అయ్యది దైవేశ్చ. ఆమె మరణించినచో నేను యొంటరిగనే తిరిగి వచ్చెదను. బాలికను నాతల్లి యధీనము నుండి మీారు మీావద్దకు రప్పించుకొనినచో, ఏమి జరుగునో

యూహించుకొనుడు." అని నళినరంజనుడు వ్రాక్కుచ్చెను. ఆమాటపై వకీలు,

"బహుశా మీరు న్యాయస్థానమున కేగవచ్చును." అనెను. పొరబడకుడు నేను న్యాయస్థానమునకు వెళ్లుటకు ముందు, మీవలుగురి యొద్దకు వచ్చెదను. రమేశబాబూ మీరు... ప్రభావతీ నీవు... గంగూలిదాదా నీవు... వకీలు బాబూ నీవు... ఆమరుచటిదినము మీలోఎందరి ప్రాణములు నిలచునో భగవంతుడుకూడ యెరుగజాలడు." అని నళినరంజనుడు ప్రతినబట్టినంతనే గంగూలి పోలీసును దీసుకొనిరమ్మని వకీలును ప్రోత్సహించెను. నళినరంజనుడు చెరియొకదెబ్బతో వారిని నిలువతీసి యింటికి వచ్చెను.

* * * * *

ఆమరునాడు సుమారు పదిగంటలకు నాతండ్రి మరణించినట్లు నాకు శాస్త్రిజీ వచ్చి చెప్పెను. ఆ ఉదయము శస్త్రచికిత్స జేయుచుండగనే ఆతడు తన ప్రాణములను విడచెను.

స్వస్థానమందేగాక వంగదేశమునందంతటను 'దేశోద్ధారకుడు' అని వినుతి కెక్కిన నాతండ్రియొక్క జీవితచరిత్ర ముగిసెను. ఆదినము కాళీగంజలో కర్మాగారములు, పాఠశాలలు, దుకాణములు, న్యాయస్థానములు మూయబడెను.

ఆదినమంతయు నేనేడ్చితిని. నాచిన్న నాటనుండియు, నాతండ్రికిని నాకునుమధ్య నల్లనినీడ చిరస్థాయిగ యేర్పడెను. ఆతని ఆత్మ శాంతికై భగవంతుని స్మరించితిని——

నాతండ్రి తన శస్త్రచికిత్సకు ముందుగనే మరణశాసనమును వ్రాసెను. కొంతయాస్తిని ధర్మకార్యార్థమై వినియోగించి, మిగిలిన యాస్తినంతయు ప్రభావతి కొసగెను. ఆస్థిని తన స్వాధీనము గావించుకొని ప్రభావతి మాపిన్నిని గంగను ఆపెద్ద భవనమునుండి తరిమివైచెను. విధివ్రాత నెవ్వరు దప్పించ గలరు?

గతరాత్రి ఒకస్వప్నమును గాంచితిని. అట్లు నేనెన్నడును గాంచియుండ లేదు. నాతల్లిని నాస్వప్నములో జూచితిని. "శశీ! నీశరీరము చల్లబడిన దేమి?" అని పలికి నాపై శాలువను గప్పెను. నాబిడ్డను విడచుట నాహృదయమును రాచి పెట్టుచుండెనని బలికితిని. "నిన్ను విడుచు నప్పుడు నామనోస్థితి గూడ యట్లేయుండెనని మాఅమ్మ చెప్పెను. అంతలోనాకు మెలకువవచ్చెను.

దిన దినము నాకు నీరస మధికమగుచుండెను. శరీరములో బాధలేదు. దగ్గుకూడ వచ్చుటలేదు. కాని ఆయాసము హెచ్చుగ యుండెను. ఈరాత్రి నేనెట్లయిన ఆతనికి యథార్థమును దెలుపవలెను. నళినరంజనునకు లేఖ వ్రాయుటకు నిశ్చయించుకొంటిని. అదియే సులభమని నేను గ్రహించితిని

## మనోహరా!

నేనేమి వ్రాసితినో దెలిసికొనుటకుముందు నీహృదయమును పదిలపరచుకొనుము. నీకిదికష్టమును కలుగజేయును. నేనది గ్రహించితిని.

కొన్ని దినములలో మన వివాహమగునని నీవు యువ్విళ్ళూరుచుంటివి. అటుపిమ్మట నన్ను నేటాల్‌లో విడచి నీవు హిమాలయశిఖరారోహణమునకై వెళ్ళుటకు తలపెట్టుకొని యుంటివి.

ప్రియా! మన వివాహము పొసగ నేరదు. నేను నీ వెంట నేటాల్ రాలేను. మరెచ్చటికిని రాలేను. అది అసంభవము. నాజీవితములో ప్రేమ అగ్రస్థానము నలంకరించెను. నాతల్లిని ప్రేమించితిని. నాబిడ్డను ప్రేమించితిని. అత్యధికముగ నిన్ను ప్రేమించితిని. ప్రేమయే నన్ను హరించుచుండెను. ఇవియే నా ఆఖరు దినములు.

నళిన్! నిన్ను మభ్యపెట్టితిని. నన్ను మన్నింపుము. నీపైగల ప్రేమయే నన్ను నిరోధించెను. నాకై విచారింపకుము. మనప్రేమ ఫలిత మనుభవించు సుదినములు సమీపించెనని మురిసిపోతిమి. కాని దైవము మనకా యదృష్టము నొసటలందు వ్రాయలేదు. నావిద్యకై నేనంత విచారింపను దాని నేకాకిని జేసి మరణించెదనేమో యనెడి భయము నాకొకప్పుడు కలదు. కాని ఆ రంగము ముగిసెను. దానిని నాకంటె యధికముగ ప్రేమించి లాలించెడివారు ఇప్పుడు కలరు.

ప్రాణవల్లభా! నేను నీకిప్పు డొసగిన వ్రాతపుస్తకము వలన నాజీవితమంతయు నీకు తెలియగలదు. అది నీవు పరిచరించితివేని నావంటి కష్టజీవులకు, మనవంటి ప్రేమారాధకులకు

ఆదర్శప్రాయము కాగలదు. రేపటి ఉదయము లేచి ఈపుస్తకము నకు ముగింపువ్రాసెదను. ఆపిమ్మట నీవే నాజీవిత ముగింపును వ్రాయగలవు.

నళిన్ ! నీకునాపైగల పవిత్ర ప్రేమకు నీత్యాగశీలతకు నాధన్యవాదములు. ఇట్లు :

నీప్రేయసి, శశిరేఖ.

నాపుస్తకమునకు ముగింపు.

అంతయు ముగిసెను. ఆతనికి నాలేఖతో నాపుస్తకము నొసంగితిని. నారహస్యములన్నియు వెళ్ళడి అయ్యెను. నళిన రంజనునకు నాయుదంతమంతయు ఇప్పుడు తెలియును.

ఈ ఉదయము నిద్రనుండి మేల్కాంచితిని. కిటికీయెదుట నళినరంజనుడు విద్యనెత్తుకొని ముద్దులాడుచుండెను. నన్ను జూచివిద్యను పైకెత్తి ఏద్దియో నుడివెను. నేను జవాబొసగ వలెననుకొంటినికాని నానోట మాట వెలువడలేదు. ప్రయత్న పూర్వకముగ చిరునవ్వుమాత్రము నవ్వితిని. తరువాత నా కన్ను లశ్రుపూరితములయ్యెను.

"విద్యా ! రమ్ము ! ఆమెను పిలువ వలదు. ఆమె భగవం తుని సాన్నిధ్యమునకు వెళ్ళి తనకష్ట ఫలితములు ననుభవింప నుండెను." అని పలికి నళినరంజను డు అచ్చటినుండి వెడలెను

ఈఉదయము చాల మనోహరముగ యుండెను. నా యెదుట కానబడుచున్న భవానీ ఆలయముయొక్క బంగారు శిఖరముపై సూర్యకిరణములు ప్రకాశించుచుండెను. పక్షులు

కలకలారవములు గావించుచుండెను. దూరమున పిల్లనగ్రోలి జీవనరాగమును ఆలాపించుచున్నది. ఆమధుర స్వరము సుఖ దుఃఖ సమ్మిళితమై యున్నది. ఆ మురళీగానము అచేతనులకు చైతన్యమును గొల్పుచున్నది.

ఆహా! ప్రకృతి ఎంత శోభాకృతిని దాల్చెను. సాయం కాలము సూర్యుడస్తమించెను. సంజకెంజాయ లాకసమున వ్యాపించెను. ఇంక ఉదయ భానుడు నాకు కానరాడు.

నళినరంజనుని సందేహము.

నా ప్రేయసి వ్రాకుచ్చినది యదార్థము. ఆమె శరీర స్థితియందలిమార్పులు నేనుగమనించుచునే యుంటిని. కాని, ఆమెను నేటాల్ దీసుకొనిపోయినచో లోకనిందకు పాల వ్యేడివాడను. అంతా అంధకారము. యిఖనేమున్నది? నా ప్రేయసి నాకొరకై గగన మండలమున నిరీక్షించు చున్నది.

సెలవు.

అయిపోయింది.

